# గ్రహణ నిర్ణయము



**గమనిక :** ఈ సంవత్సరము ఆంధ్ర-తెలంగాణ రాష్ట్రములందు కనిపించు సూర్య-చంద్రగ్రహణములు లేవు. ది.26-05-2021 బుధవారము నాడు చంద్రగ్రహణ స్పర్శ పగలు గం॥3-15ని॥లకు ప్రారంభమయి, మోక్షము సాయంత్రము గం॥6-22ని॥లకు పూర్తగును. ఒక్క శ్రీకాకుళం జిల్లాలోని కొన్ని ప్రాంతములు మినహాయించి, ఉభయ తెలుగు రాష్ట్రములలోని అన్ని ప్రాంతములందు చంద్రగ్రహణ మోక్షకాలము సూర్యాస్తమయ సమయముకంటే ముందుగానే పూర్తగుచుండుట వలన మరియు శ్రీకాకుళం జిల్లాలోని ప్రాంతములందు చంద్రోదయ సమయము, గ్రహణ మోక్షకాలమును దాటి ఉండుట వలన ఈ గ్రహణ మోక్షకాలము కూడా ఎక్కడా మనకు కనిపించదు. సోంపేట, ఇచ్ఛాపురము, పలాస ప్రాంతములందు సూర్యాస్తమయం సా॥6-19. గ్రహణమోక్షము సా॥6-22. చంద్రోదయం సా॥6-24. గ్రహించగలరు.







## శ్రీప్లవ నామ సంవత్సరము 2021-22 వర్ష కార్తెలు - ఫలితములు

| కార్తెలు | ప్రవేశతేది | ఫలితసూచనలు |
|---|---|---|
| 1. అశ్విని | ది. 14-04-2021 | ఎండలు-గాలులు అధికముగా ఉండును. కొన్ని తావుల ఆకస్మిక వర్షములు-పిడుగులు |
| 2. భరణి | ది. 27-04-2021 | ఉష్ణోగ్రతలు తీవ్రముగా పెరుగును. ప్రతికూల వాతావరణము. పశుపక్ష్యాదులకు నష్టం. |
| 3. కృత్తిక | ది. 11-05-2021 | వడగాల్పులు అధికము. ప్రజలకు ప్రాణనష్టములు. అగ్ని ప్రమాదములు. తీవ్ర ఎండలు. |
| 4. రోహిణి | ది. 25-05-2021 | ఎండలు తీవ్రత తగ్గును. కొన్ని తావుల ఆకస్మిక వర్ష సూచన. ఆకాశము మేఘావృతం. |
| 5. మృగశిర | ది. 08-06-2021 | కొన్నితావుల తొలకరి వర్షించును. అల్పపీడనము పట్టును. ఉరుములుతో పిడుగులు. |
| 6. ఆరుద్ర | ది. 22-06-2021 | భారీనుండి అతిభారీ వర్షములు కురియును. పంటలకు అనుకూలమగు వర్షపాతము. |
| 7. పునర్వసు | ది. 06-07-2021 | కుండపోత వర్షములు. ముసురు పట్టును. నదులు ఉధృతముగా ప్రవహించును.వరద. |
| 8. పుష్యమి | ది. 20-07-2021 | అతిభారీ వర్షములు. వరద ముంపులు. వారం రోజులు పాటు ఎడతెగని వానలుండును |
| 9. ఆశ్లేష | ది. 03-08-2021 | గాలులుతో కూడిన వర్షములు. నదులు ఉధృతముగా ప్రవహించును. పిడుగుపాటులు. |
| 10. మఖ | ది. 17-08-2021 | మంచి వర్షములు కురియును. చెరువులు జలకళతో ఉట్టిపడును. కొన్ని తావుల వరద. |
| 11. పుబ్బ | ది. 30-08-2021 | పగలు ఎండలు ఉంటూ రాత్రిళ్ళు వర్షములు కురియును. దట్టమైన మేఘ చలనములు |
| 12. ఉత్తర | ది. 13-09-2021 | చలిగాలులు వీచును. సామాన్య వర్షపాతముంటుంది. విచిత్ర వాతావరణము. మేఘము |
| 13. హస్త | ది. 27-09-2021 | గాలులుతో కూడిన ఆకస్మిక వర్షములు. శీతల ప్రభావము హెచ్చును. పిడుగుపాటులు. |
| 14. చిత్త | ది. 10-10-2021 | పగలు ఎండల తీవ్రతయు, రాత్రిళ్ళు చలి తీవ్రతయు పెరుగును. పెనుగాలులుండును |
| 15. స్వాతి | ది. 24-10-2021 | తుఫాను పట్టును. తీర ప్రాంత ప్రజలు జాగ్రత్తగా ఉండాలి. సముద్రము అల్లకల్లోలము. |
| 16. విశాఖ | ది. 06-11-2021 | కొన్నితావుల ఆకస్మిక వర్షములు కురియును. చలిగాలులు లేదా మంచు అధికమగును |
| 17. అనురాధ | ది. 19-11-2021 | అల్పపీడనము పట్టును. విచిత్ర వాతావరణం. కొన్నితావుల వడగండ్ల వర్షములుండును. |
| 18. జ్యేష్ఠ | ది. 03-12-2021 | చలిగాలులు మరియు పొగమంచు అధికము. ప్రతికూల వాతావరణముచే నష్టములు. |

## నవనాయక ఫలములు

**1.రాజు-కుజ :** సేనాధిపతి రాజగుట వలన, నిరంకుశ లేదా నియంతృత్వ పాలన సాగును. ప్రభువులు మరియు అధికారుల మధ్య కలహములు వచ్చును. ప్రతికూల వాతావరణముచే పంటలు నష్టమగును. వైవాహిక సమస్యలు అధికమగును. కుజ కక్ష్యలో ఉన్న శుక్రుడు, 1-6 భావముల కక్ష్యాధిపతి అగుటచే పాలనలో ఉద్యోగుల పాత్ర పెరుగును. ఉన్నత ఉద్యోగములందు, పాలన నందు స్త్రీల ప్రాముఖ్యత ఏర్పడును. శుక్రుడు 12లో ఉండుట వలన ప్రభువులకు కోర్టు శిక్షలు ఖరారు కావచ్చు.

**2.మంత్రి-బుధ :** నిపుణత్వ గ్రహము మంత్రిగా ఉండుట శుభం. మేఘాడంబరములు. పంటలు తక్కువ. మంత్రులకు ప్రభువుకు మధ్య విరోధములుండును. మంత్రుల పనితీరు బాగున్ననూ వారికి ప్రమాదములు పొంచిఉన్నవి. ఒకానొక మంత్రికి ఖైదు లేదా ప్రాణగండము.

**3.సేనాధిపతి-కుజ :** రక్షణ వ్యవస్థ పటిష్టమగును. అల్లర్లు-సమ్మెలు జరుగును. రక్షణ వ్యవస్థలో స్త్రీలకు మరింత ప్రాధాన్యత కలుగును. పోలీసులు పనితీరు బాగున్ననూ, కొన్ని వివాదస్పద సంఘటనలుండును.

**4.సస్యాధిపతి-శుక్ర :** తెల్లని భూములు, తెలుపు వంగడములు, మాగాని-మెట్ట పంటలు ఫలించును. శుక్ర కక్ష్యలలో, నక్షత్రాలలో ఏ గ్రహములు లేనందున పంటలు బాగుగా ఫలించిననూ, 1-6-12 ప్రభావముచే క్రిమికీటక-ప్రతికూల వాతావరణము వలన పంటలు పాడగును.

**5.ధాన్యాధిపతి-గురు :** అపర పంటలు, శనగలు, కుసుమలు, అరటి, పసుపు విరివిగా పండును. ధాన్యములకు ధరలు హెచ్చును. గురు కక్ష్యలో రాహువు సంచరించుట వలన ఆహార ధాన్యముల నిల్వలు పెరుగును.

**6.అర్ఘ్యాధిపతి-కుజ :** సమస్త వస్తువులకు, ముఖ్యముగా భూమి పొరలలో పండే, వేరుశనగ, ఉల్లి, వివిధ దుంపజాతులకు మంచి గిరాకీ ఏర్పడును. కందులు, మిర్చి, ఆవాలు, ముల్లుగల ధాన్యములకు ధరలు హెచ్చగును. ఒకానొక సమయములో కిలో ఉల్లి ధర 150 నుండి 240 ఉండవచ్చు.

**7.మేఘాధిపతి-కుజ :** పర్వత లేదా అటవీ వర్షములు అధికము. వడగండ్లు-పిడుగులు ఉండును. పంటలు తక్కువగా పండును. కొన్ని తావుల అనావృష్టి మరికొన్ని తావుల అతివృష్టి ఉంటుంది.

**8.రసాధిపతి-రవి :** తిలలు-నూనెలు-బెల్లము-ఉప్పు వంటి రసవస్తువులకు ధరలు తగ్గును. తూర్పు ప్రాంతములందు భూగర్భ జలములు ఇంకిపోవును. కొన్నితావుల భూమి పొరలందు పెద్ద పెద్ద పగుళ్ళు ఏర్పడును

**9.నీరసాధిపతి-శుక్ర :** మంచి గంధము, కర్పూరము, అగరు మొదలగు సుగంధ వస్తువులకు, బంగారము, వెండి, ముత్యములు, వస్త్రములకు ధరలు హెచ్చు తగ్గులుగా ఉండును. ధరలలో నిలకడ ఉండదు.





## సంక్రాంతి పురుషుడు - "మిశ్రా" నామధేయుడు

ది. 14-01-2022 శ్రీ "ప్లవ" నామ సంవత్సర పుష్యమాస శుక్ల పక్ష ద్వాదశి శుక్రవారము రోహిణి నక్షత్ర, బ్రహ్మ యోగ, బాలవ కరణ యుక్త మిధున లగ్నము నందు సాయంత్రము గం॥ 4-55 ని॥లకు **"మిశ్రా"** నామధేయుడైన **సంక్రాంతి పురుషుడు** (శ్రీ సూర్యభగవానుడు)**వ్యాఘ్ర** వాహనారూఢుడై **మకరరాశి** ప్రవేశము చేయును.

"మిశ్రా" నామము వలన పశువులకు హాని. **శంఖోదక** స్నానముచే సుఖము. **రక్తవర్ణ** వస్త్ర ధారణచే వ్యాధి. **చందన** గంధ లేపనముచే బ్రాహ్మణులకు కష్టము. **రజిత** పాత్రలో భుజించుటచే సుభిక్షము. **అరటి పండు** తినుట వలన ఫలనాశనము. **పాయసము** భుజించుటచే పశునాశనము. **పులి** వాహనము నెక్కుటచే జంతునాశనము. **కూర్చొని** ఉండుట వలన మధ్యమ ధరలు. **క్రోధ** ముఖముచే జననష్టము. **ఎఱుపు** గొడుగు ధరించుటచే యుద్ధభయములు. **జాజి** పుష్ప ధారణచే శ్రేయస్కరము. **ముత్యాల** ధారణచే శుభము. **భిండివాల** ఆయుధ ధారణచే వ్యాధిభయము. **దక్షిణ** దిశాగమనముచే దక్షిణ ప్రాంతములకు హాని.

**శుక్లపక్షము**లో వచ్చుటచే దుర్భిక్షము. **ద్వాదశి** తిథిచే సుఖము. **శుక్రవారము** ప్రవేశమగుటచే సుభిక్షము. **రోహిణి** నక్షత్రము వలన జ్ఞానము. బ్రహ్మ యోగముచే సంతోషము. **బాలవ** కరణముచే సువృష్టి. **మిధున** లగ్నముచే పురుషులకు మేలు. **సాయంకాల** ప్రవేశముచే శూద్రులకు హాని.

ఈ మకర సంక్రమణ ఉత్తరాయణ పుణ్యకాలమందు ప్రజలు తమ యథాశక్తి నవధాన్యములు, కూష్మాండాది సువర్ణ దానములు, అన్నదాన ములు, గోదానములు చేసిన ఎడల దోష ఫలముల తీవ్రత నశించి సకల జనులకు శుభము జరుగును.



## ద్వాదశ రాశులకు ఆదాయ-వ్యయాదులు

| రాశులు | రాబడి | పోబడి | రాశులు | కీర్తి | అపకీర్తి |
|---|---|---|---|---|---|
| మేషరాశి | 8 | 14 | మేషరాశి | 4 | 3 |
| వృషభరాశి | 2 | 8 | వృషభరాశి | 7 | 3 |
| మిధునరాశి | 5 | 5 | మిధునరాశి | 3 | 6 |
| కర్కాటకరాశి | 14 | 2 | కర్కాటకరాశి | 6 | 6 |
| సింహరాశి | 2 | 14 | సింహరాశి | 2 | 2 |
| కన్యారాశి | 5 | 5 | కన్యారాశి | 5 | 2 |
| తులారాశి | 2 | 8 | తులారాశి | 1 | 5 |
| వృశ్చికరాశి | 8 | 14 | వృశ్చికరాశి | 4 | 5 |
| ధనుస్సురాశి | 11 | 5 | ధనుస్సురాశి | 7 | 5 |
| మకరరాశి | 14 | 14 | మకరరాశి | 3 | 1 |
| కుంభరాశి | 14 | 14 | కుంభరాశి | 6 | 1 |
| మీనరాశి | 11 | 5 | మీనరాశి | 2 | 4 |

సర్వ ఆదాయము = 96, సర్వ వ్యయము = 108, దేశ కీర్తి = 50, దేశ అపకీర్తి = 43.

## కందాయ ఫలములు

| నక్షత్రము | ప్రథమ | ద్వితీయ | తృతీయ | నక్షత్రము | ప్రథమ | ద్వితీయ | తృతీయ |
|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 0 | 2 | 4 | స్వాతి | 2 | 1 | 1 |
| భరణి | 3 | 0 | 2 | విశాఖ | 5 | 2 | 4 |
| కృత్తిక | 6 | 1 | 0 | అనురాధ | 0 | 0 | 2 |
| రోహిణి | 1 | 2 | 3 | జ్యేష్ఠ | 3 | 1 | 0 |
| మృగశిర | 4 | 0 | 1 | మూల | 6 | 2 | 3 |
| ఆరుద్ర | 7 | 1 | 4 | పూర్వాషాఢ | 1 | 0 | 1 |
| పునర్వసు | 2 | 2 | 2 | ఉత్తరాషాఢ | 4 | 1 | 4 |
| పుష్యమి | 5 | 0 | 0 | శ్రవణము | 7 | 2 | 2 |
| ఆశ్లేష | 0 | 1 | 3 | ధనిష్ఠ | 2 | 0 | 0 |
| మఖ | 3 | 2 | 1 | శతభిషము | 5 | 1 | 3 |
| పుబ్బ | 6 | 0 | 4 | పూర్వాభాద్ర | 0 | 2 | 1 |
| ఉత్తర | 1 | 1 | 2 | ఉత్తరాభాద్ర | 3 | 0 | 4 |
| హస్త | 4 | 2 | 0 | రేవతి | 6 | 1 | 2 |
| చిత్త | 7 | 0 | 3 | - | - | - | - |

**సూచన :** ఒక్కొక్క కందాయము సంవత్సరాది లగాయతు నాలుగు మాసములు ఉండును. ఇందలి బేసిసంఖ్యలు ధనలాభమును, సరిసంఖ్యలు సమఫలమును, సున్న శూన్యఫలమును ఇచ్చును.





## శ్రీ ప్లవ లో ఆంధ్రప్రదేశ్ భవిష్యత్

| | | | |
|---|---|---|---|
| | శుక్ర 17° కేతు 02° | రవి 23° | బుధ(వ) 09° గురు 28° |
| లగ్నము 16° | నవ్యాంధ్రప్రదేశ్ ఆవిర్భావ కుండలి 8-06-2014 ఆదివారము గం॥ 00.00 అమరావతి | | |
| | | | |
| | | రాహు 02° శని(వ) 24° | చంద్ర 14° కుజ 17° |

| | | | |
|---|---|---|---|
| రవి 28° చంద్ర28° బుధ21° | శుక్ర 02° | లగ్న03° కుజ29° రాహు19° | |
| గురు 01° | వర్షలగ్నకుండలి 12-04-2021 సోమవారము ఉదయము 8-01 అమరావతి | | |
| శని 18° | | | |
| | కేతు19° | | |

వర్తమానమున నవ్యాంధ్రప్రదేశ్ రాష్ట్రమునకు కుజ మహాదశ నడుస్తున్నది. ఇందు ది.21-07-2021 వరకు కుజ భుక్తి నడుచును. కుజ కక్ష్యలో, కుజ-కేతువులు సంచరిస్తున్నారు. కుజ నక్షత్రములో రాహువు, కేతు నక్షత్రములో కేతువు సంచరిస్తున్నారు. కుజుడు నుండి కేతువు 8దింట, రాహువు 2డింట ఉండుట వలన... ఈ కుజ కుజ భుక్తి నందు ప్రముఖుని మరణము విభ్రాంతిని కల్గించును. రాష్ట్రము మరింత అప్పుల ఊబిలో కూరుకుపోవును. అగ్ని-జల ప్రమాదములందు ప్రాణనష్టములుండును. పాముకాటులు-క్రూర జంతువుల బాధలు అధికమగును. ఒకానొక ప్రమాదమునందు నావికా లేదా రక్షక దళమునకు చెందినవారి మూకుమ్మడి మరణములు ఉండును. కొన్ని తావుల శిధిల గృహములు లేదా వంతెనలు కూలిపోయే ప్రమాదములు ఉన్నవి. వరద ముప్పులు - భూ ప్రకంపనలు ఉంటాయి. కొన్నితావుల పురాతన వస్తువులు-నిధులు బయలు పడును. అంటువ్యాధులు, వింతరోగములు భయము కల్గించును. కన్యారాశిలో కుజ-చంద్రుల వలన కన్యలపై, చిన్నారులపై అఘాయిత్యములు అధికమగును. పట్టపగలు దారీదోపిడీలు జరుగును. ఒకానొక సమయములో కేంద్రప్రభుత్వ జోక్యముతో రాష్ట్రములో అత్యవసర పరిస్థితి ప్రకటిత మయ్యే అవకాశములు ఉండవచ్చు. పంటలు తీవ్రముగా నష్టపడును.

ది.21-07-2021 నుండి రాహు భుక్తి నడుచును. రాహు కక్ష్యనందు ఎటువంటి గ్రహములు లేవు. బుధుడు రాహు నక్షత్రములో సంచరిస్తున్నా

డు. కుజుడు నుండి రాహువు 2డింట, బుధుడు10దింట, ఉండుట వలన, మరియు నవ్యాంధ్రప్రదేశ్ లగ్నమునకు రాహువు 9దింట ఉండి, 4-9 కక్ష్యలను, బుధుడు 5దింట వక్రగతిలో ఉండి, 3-10 కక్ష్యలను బలపరుచుటచే.... ఈ రాహు భుక్తి నందు అధికారములో ఉండే వ్యక్తులు అధికారము కోల్పోయే పరిస్థితులు ఏర్పడును. మంత్రులకు పదవీగండములు ఉండును. ప్రజలకు అంటువ్యాధులు, చర్మవ్యాధులు కలుగును. కెమికల్ ఫ్యాక్టరీలకు దూరముగా ఉండుట మంచిది. క్రీడాస్ఫూర్తికి భంగం కలిగించే సంఘటనలు జరుగును. విద్యావ్యవస్థలందు అవకతవకలు వెలుగు చూచును. బుధ-రాహువుల ప్రభావముచే గ్యాంబ్లింగ్‌లు, లిక్కర్ మాఫియాలు ఉధృతమగును. ఆర్థిక వ్యవస్థ కొంత బలపడును. విద్యార్థులు ప్రమాదకర ప్రదేశములకు వెళ్ళరాదు. సోషల్ మీడియాలో పుకార్లు అధికమగును. సోషల్ మీడియా మూలకంగా విస్తుపోయే అరాచకములు బయలు పడును. ఒకానొక సమయములో కమ్యూనికేషన్లు స్తంభించిపోవును.

1. నవ్యాంధ్రప్రదేశ్ లగ్నమునకు వర్షకుండలి లగ్నము 4వది అగుటచే ప్రజలకు వాహన-జల-వాతావరణ విపత్తులు.

2. జన్మలగ్న కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 12డింట ఉండి బుధ నక్షత్రము నందు సంచరించుటచే... రాష్ట్ర సాధారణ పరిస్థితులు అస్తవ్యస్తము. ఆర్థిక నేరగాళ్ళకు-ప్రముఖులకు కారాగారవాసము. కుంభకోణములు

3. ధనభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 12డింట ఉండి, కేతు నక్షత్రము నందు సంచరించుటే...ఆదాయ మార్గములు సన్నగిల్లును. రాష్ట్ర ఆర్థిక పరిస్థితి ఆందోళన కలిగించును. వస్తు సుంకములు తప్పవు.

4. తృతీయభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 12డింట ఉండి, స్వ నక్షత్రము నందు సంచరించుటచే....ఘోరమైన రోడ్డు-రైలు ప్రమాదములు జరుగును. విద్యుత్-రవాణా చార్జీలు పెరుగును. రక్షణ రంగము వారికి ప్రమాదకాలము. ఒకానొక సమయము నందు సమాచార వ్యవస్థ స్తంభించును. మీడియా రంగ ప్రముఖునికి జైలుశిక్ష పడును.

5. చతుర్థభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 2డింట ఉండి, చంద్ర నక్షత్రము నందు సంచరించుటచే....వాతావరణ దుర్యోగములచే





పంట- ప్రాణ-ఆస్తి నష్టములు. వరదలు-తుఫాన్లు ఉండును. వాహన ప్రమాదములు ఎక్కువ. చాలా విద్యాలయములు మూత పడును. పాఠశాలలు-కళాశాలలు-గనులు-పారిశ్రామిక కర్మాగారాలలో ఘోర ప్రమాదములున్నవి. నదులు ఉధృతముగా ప్రవహించును.

6. పంచమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 12డింట, బుధ నక్షత్రము నందు సంచరించుటచే....విద్యార్థుల మరణము రికార్డు స్థాయిలో ఉండును. విద్యాలయాలు-సినిమా థియేటర్స్‌నందు ప్రమాదములు. చలనచిత్ర పరిశ్రమకు ప్రతికూల కాలము. మెగాస్టార్ కు ప్రమాదము.

7. షష్ఠమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 9దింట, చంద్ర నక్షత్రము నందు సంచరించుటచే....రక్షణ-వైద్య రంగములు పటిష్టమగును.

8. సప్తమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 10దింట, కుజ నక్షత్రము నందు సంచరించుటచే....విదేశీ ఋణలాభములు కలుగును. బడా వ్యాపారులకు ప్రోత్సాహములు ఉండును. ముఖ్యమంత్రికి ప్రమాదం.

9. అష్టమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 12డింట, బుధ నక్షత్రము నందు సంచరించుటచే....మరణాల రేటు పెరుగును. అంటువ్యాధులు విజృంభించును. విస్మయకర ఘటనలు వెలుగు చూచును.

10. నవమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 2డింట, చంద్ర నక్షత్రము నందు సంచరించుటచే...జల-వాయు-వైమానిక ప్రమాదములు జరుగును. మత ఘర్షణలు అధికమగును. శాస్త్ర-సాంకేతిక ప్రయోగములు వైఫల్యము చెందును. న్యాయవాదులు-స్వామీజీలకు ప్రమాదములు.

11. దశమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 12డింట, స్వ నక్షత్రము నందు సంచరించుటచే....ప్రభుత్వ వ్యతిరేకత అధికమగును.అధికారములో ఉన్న వారికి ప్రమాదములు-జైలు శిక్షలు ఉంటాయి.

12. లాభభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు, 12డింట, కేతు నక్షత్రము నందు సంచరించుటచే....మధ్యంతర ఎన్నికలకు పరిస్థితులు దారీ తీయవచ్చు లేదా శాసన సభ్యులు మరణముచే ఉపఎన్నికలుండును.

13. వ్యయభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు, 12డింట, బుధ నక్షత్రములో సంచరించుటచే.....అనవసర వ్యయము తగ్గును. జైళ్ళు-ఆసుపత్రులయందు సంస్కరణలు జరుగును. నిఘా వ్యవస్థ బలపడును.

**2021 ఏప్రిల్ 13 నుండి :** పన్నులు పెరుగును. విద్యార్థులకు-మంత్రులకు-పాలకులకు ప్రమాదములున్నవి. రేషన్ లేదా ఆహార కొఱత.
**మే 13 నుండి :** విద్యాలయాలు-సినిమా థియేటర్ల వద్ద ప్రమాదములు కలుషిత ఆహారం. అధిక ధరలు. ప్రముఖులకు జైలు. వాతావరణ మార్పు.
**జూన్ 13 నుండి :** పోలీసులకు-పత్రికాధిపతులకు-సోషల్ మీడియా వ్యక్తులకు ప్రమాదము. వాహన-వాతావరణ గండములు. 144 సెక్షన్లు.
**జూలై 13 నుండి :** వాతావరణ విపత్తులు. అధికారములో ఉన్న వ్యక్తులకు ప్రమాదము. ప్రముఖుని మరణము. సమ్మెలు-ఆందోళనలు.
**ఆగస్ట్ 13 నుండి :** మంత్రులకు-చలనచిత్ర ప్రముఖులకు గండము నదీ ప్రవాహ ఉధృతి. వాతావరణ దుర్యోగములు. వస్తు ధరలు అధికము.
**సెప్టెంబర్ 13 నుండి :** ప్రజలకు వింతరోగములు. సానుభూతికర సంఘటనలు. ప్రముఖుని మరణము లేదా దురావస్థ విస్మయపరుచును.
**అక్టోబర్ 13 నుండి :** అగ్ని లేదా రైలు ప్రమాదము. మీడియా వ్యక్తులకు లేదా నటీ-నటులకు ప్రమాదములు. బస్సు చార్జీలు పెరుగును.
**నవంబర్ 13 నుండి :** విష-క్రూర జంతు ఘటనలు. ప్రభుత్వ వ్యతిరేకత. పరిపాలనా లోపములు. ముఖ్యమంత్రికి ప్రమాదము. తుఫాన్.
**డిసెంబర్ 13 నుండి :** చలి గాలులు పెరుగును. నూతన సంస్కరణలు. కళాకారులకు-నటులకు ప్రమాదములు. విమాన ప్రమాదము.
**2022 జనవరి 13 నుండి :** ప్రజలకు-పశు పక్ష్యాదులకు అనారోగ్యములు. కొన్నితావుల అగ్ని ప్రమాదము. స్త్రీలపై అఘాయిత్యములు.
**ఫిబ్రవరి 13 నుండి :** విదేశీ ప్రముఖుల ఆగమనము. మంత్రి పదవులందు మార్పులు-చేర్పులు. ఆదాయ మార్గాలపై శ్రద్ధ. యజ్ఞ-యాగాదుల నిర్వహణ. జంతు బెడద. అధికార ప్రముఖుని మరణము.
**మార్చ్ 13 నుండి :** క్రీడాకారులకు ప్రమాదములు. ఆర్థిక కుంభకోణములు బయలు పడును. ప్రముఖుల ఇంట వివాహ-కుటుంబ సమస్యలు. నూతన మార్గముల అభివృద్ధి. రైలు లేదా వాహన ప్రమాదము.





## శ్రీ ప్లవ లో తెలంగాణ భవిష్యత్

| | | | |
|---|---|---|---|
| | శుక్ర 11° కేతు 02° | రవి 18° | బుధ 08° గురు 26° |
| లగ్నము 06° | తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావ కుండలి 2-06-2014 సోమవారము గం॥ 00.00 హైదరాబాద్ | | చంద్ర 02° |
| | | | |
| | | రాహు 02° శని(వ) 24° | కుజ 16° |

| | | | |
|---|---|---|---|
| రవి 28° చంద్ర28° బుధ21° | శుక్ర 02° | లగ్న01° కుజ29° రాహు19° | |
| గురు 01° | వర్షలగ్నకుండలి 12-04-2021 సోమవారము ఉదయము 8-01 హైదరాబాద్ | | |
| శని 18° | | | |
| | కేతు19° | | |

వర్తమానమున తెలంగాణా రాష్ట్రమునకు శని మహాదశ నడుస్తున్నది. ఇందు ది. 7-06-2021 వరకు బుధ భుక్తి నడుచును. బుధ కక్ష్యలో శని వక్రములో సంచరిస్తున్నాడు. శని నక్షత్రాల్లో ఏ గ్రహములు లేవు. శని 10వ భావములో వక్రములో ఉండుట వలన అధికార పక్షమునకు కొంత వ్యతిరేకత పెరిగిననూ, శని ఉన్న నక్షత్రాధిపతి 2-6-11 భావములను ప్రభావితము చేయుట వలన కొంత వరకూ అనుకూలము. శని ఉన్న భావము నుండి శని 2-3-4-5 భావములను ప్రభావితము చేయుట వలన విద్యార్థులు-కార్మికులు-కర్షకులు జాగ్రత్తగా ఉండాలి. ప్రజలు-ప్రభువులు ఆరోగ్యరీత్యా శ్రద్ధగా ఉండాలి. వాహన-జల-వాతావరణ ప్రమాదములు ఉండును.

ది. 7-06-2021 నుండి కేతు భుక్తి నడుచును. కేతు కక్ష్యలలో ఏ గ్రహములు లేవు. కేతు నక్షత్రాలలో శుక్ర-కేతువులు సంచరిస్తున్నారు. ఈ శుక్ర-కేతువులు లగ్నము నుండి 3డింట, శని నుండి 6రింట ఉండుట వలన రక్షణ-సమాచార రంగములు బలపడును. ప్రజలు నూతన రోగములతో బాధపడుదురు. ఈ సంవత్సరము కూడా వాతావరణ దుర్యోగములచే ప్రజలు చాలా బాధలు పడాలి. శుక్ర-కేతువుల ప్రభావముచే ఒకానొక సమయములో విద్యుత్-కమ్యూనికేషన్ వ్యవస్థలు స్తంభించిపోవును. గో ఉద్యమం లాంటివి జరుగును. భారీ అగ్ని ప్రమాదములు, సర్ప-క్రూర జంతు బాధలు ఉండును. శుక్ర-కేతువుల ప్రభావముచే సెక్స్ కుంభకోణములు వెలుగు చూచును. మీడియా రంగము వారికి సమస్యలు

వచ్చును. ముఖ్యమంత్రి గారు అనారోగ్యముతో ఇబ్బంది పడుదురు. గనులందు ప్రమాదములు ఉంటాయి. రక్షణ వ్యవస్థలో స్త్రీల ప్రాముఖ్యత మరింత పెరుగును. శుక్రుడు లగ్నం నుండి బాధకాధిపతి గాను, శని ఉన్న భావము నుండి మారకాధిపతి గాను ఉండుట వలన, రాష్ట్రములో సానుభూతికర సంఘటనలు జరుగును. కార్మికులు చాలా జాగ్రత్తగా ఉండాలి. ముఖ్యమంత్రి గారికి చాలా ప్రమాదకాలముగా ఉండవచ్చు.

1. తెలంగాణా లగ్నమునకు వర్షకుండలి లగ్నము **4వది అగుటచే ప్రజలకు వాహన-జల-వాతావరణ విపత్తులు.**

2. జన్మలగ్న కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 12డింట ఉండి బుధ నక్షత్రము నందు సంచరించుటచే.... జన-జీవన పరిస్థితులు ఆందోళన కల్గించును. ఉద్యోగులకు-అధికారులకు-ప్రభువులకు ప్రమాదకాలము

3. ధనభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 10దింట చంద్ర నక్షత్రము నందు సంచరించుటచే....నూతన ఉద్యోగ నియామకాలందు అవకతవకలు ఏర్పడును. ఆర్థికాభివృద్ధి మందగించును. పుకార్లు బాగా వ్యాపించును.

4. తృతీయభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 2డింట, చంద్ర నక్షత్రము నందు సంచరించుటచే... నిధులలేమిచే నిర్మాణాత్మక పనులు మందగించును. ప్రముఖ మీడియాధిపతి కాలము చేయును. రక్షక భటులకు ప్రమాదములు ఉన్నవి. రోడ్డు-రైలు-జల ప్రమాదములు జరుగును.

5. చతుర్ధభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 12డింట, బుధ నక్షత్రము నందు సంచరించుటచే...వాతావరణ దుర్యోగములచే ఆస్తి-ప్రాణ నష్టములు ఉండును. ఈ సంవత్సరము కూడా భారీ వర్షములు-గాలులు తెలంగాణా ప్రజలను ఇబ్బంది పెట్టును. ముందు జాగ్రత్త అవసరం.

6. పంచమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 8దింట, బుధ నక్షత్రము నందు సంచరించుటచే.... విద్యార్ధులకు ప్రమాదములు ఉన్నవి. విదేశీ విద్యార్ధులతో సమస్యలు ఏర్పడును. నేర ప్రవృత్తి పెరుగును. విద్యాలయాలు-థియేటర్లు-అంగడిలందు ఉగ్రవాద చర్యలు ఉండవచ్చు.

7. షష్టమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 2డింట, స్వ నక్షత్రము నందు సంచరించుటచే.... రక్షణ వ్యవస్థ పనితీరు అద్భుతముగా ఉండు





ను. తెలంగాణా పోలీస్ ప్రముఖులకు మెడల్స్ వచ్చును. మిలటరీలో పనిచేయు వారికి సత్కారములు చేయుదురు. ప్రజలకు వింతరోగములు.

8. సప్తమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 12డింట, బుధ నక్షత్రము నందు సంచరించుటచే.... వైవాహిక సమస్యలు ఎక్కువగును. విదేశీ దౌత్యములు ఫలించును. విదేశీ వ్యాపారములు వృద్ధియగును.

9. అష్టమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 8దింట, బుధ నక్షత్రము నందు సంచరించుటచే.... మరణాలు రేటు పెరుగును. వివిధ ఘటనలచే ప్రాణ నష్టములు అధికమగును. ఆర్ధిక కుంభకోణములు.

10. నవమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 12డింట, బుధ నక్షత్రము లో సంచరించుటచే.... కోర్టు వ్యవహారములు జాప్యమగును. న్యాయవాదులకు-న్యాయమూర్తులకు-స్వామీజీలకు ప్రతికూలకాలము. మతకలహములు జరుగును. దేవాదాయ-ధర్మాదాయ శాఖలో మార్పులు.

11. దశమభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 2డింట, చంద్ర నక్షత్రము లో సంచరించుటచే.... పాలకులకు ప్రమాదములు జరుగును. అధికార పక్షమునకు వ్యతిరేకత పెరుగును. లుకలుకలు బయలుపడును.

12. లాభభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 10దింట, చంద్ర నక్షత్రము నందు సంచరించుటచే.... శాసన సభ్యులకు ప్రమాదములు. అసెంబ్లీలో విస్మయకర సంఘటనలు. స్పీకర్ గారికి అనారోగ్యము.

13. వ్యయభావ కక్ష్యాధిపతి, వర్షలగ్న కుండలి నందు 12డింట, స్వ నక్షత్రము నందు సంచరించుటచే.... నిఘా వ్యవస్థ బలపడును. ఆసుపత్రులు-జైళ్ళు నందు నూతన సంస్కరణలు జరుగును. రాజకీయ నాయకులు విదేశములు వెళ్ళెదరు. ప్రభుత్వ శాఖలందు అనవసర ధనవ్యయమును తగ్గించే ప్రణాళికలు అమలు చేయుదురు. నిగూఢ సొరంగ మార్గములు.

**2021 ఏప్రిల్ 13 నుండి :** ఎండల తీవ్రత అధికమగును. విదేశీ వాణిజ్యాభివృద్ధి. కళ్యాణలక్ష్మికి ధనం పెంపు. ఆర్ధిక కుంభకోణములు.
**మే 13 నుండి :** ఆకస్మిక వాతావరణ మార్పు. నిత్యావసర వస్తు ధరలు బాగా పెరుగును. చిన్నారులకు, విద్యార్ధులకు ప్రమాదములు. విద్యాలయాలు, సినిమా థియేటర్ల వద్ద అలజడులు. కొన్ని తావుల వాహన

-అగ్ని ప్రమాదములు. అటవీ మృగముల వలన భయాందోళనలు.

**జూన్ 13 నుండి :** నూతన ఉపాధి అవకాశములు. ప్రభుత్వ ఆదాయము మెరుగుపడును. అధికారులకు-పాలకులకు ప్రమాదములున్నవి.

**జూలై 13 నుండి :** కలుషిత ఆహార ఘటనలు. వాతావరణ దుర్యోగములు. ఆహార ధాన్యములకు నష్టములు. వస్తు ధరలు అధికమగును.

**ఆగస్ట్ 13 నుండి :** మంత్రులకు గండములు. శిశుసంక్షేమ శాఖలో అవకతవకలు. వివిధ ఘటనలలో విద్యార్థులకు ప్రమాదములు. రాజకీయ నాయకులకు వ్యతిరేకత. రాజకీయపరమైన సమస్యలు. రోడ్డు-జల-వాతావరణ మూలక సమస్యలు. పంటలు-ఇళ్ళు పాడగును. జన నష్టములు.

**సెప్టెంబర్ 13 నుండి :** వివిధ సంఘటనలచే మరణములు అధికమగును. పోలీసు ప్రముఖులు జాగ్రత్తగా ఉండాలి. నాయకులకు నోటి దురుసు ఎక్కువగును. కొన్ని తావుల ఆకస్మిక అగ్ని ప్రమాదములు.

**అక్టోబర్ 13 నుండి :** ప్రజలు ఫ్లూ వంటి అనారోగ్యముతో బాధపడుదురు. వాతావరణ ప్రమాదములు. క్రమేపి చలి పెరుగును. అధికార పక్షములో అసమ్మతి రాగములుండును. వాహన ప్రమాదములు ఎక్కువ.

**నవంబర్ 13 నుండి :** తుఫాన్ లేదా అల్పపీడన ప్రభావముచే నష్టములు. యజ్ఞ-యాగాది క్రతువులు జరుగును. సర్ప-క్రూర జంతు భయములు. వైరస్ ప్రభావము హెచ్చును. విదేశీ వ్యక్తుల ఆగమనము.

**డిసెంబర్ 13 నుండి :** స్త్రీలపై అఘాయిత్యములు పెరుగును. అంటురోగములు విజృంభించును. కల్తీ మద్యము వలన మరణములు.

**2022 జనవరి 13 నుండి :** అగ్ని ప్రమాదములు వలన తీవ్ర నష్టములు ఉండవచ్చు. సినిమా ప్రముఖులకు అరిష్టము. ఆకస్మిక వాతావరణముచే ఇబ్బందులు. నూతన దేవాలయ నిర్మాణములు. ఆదాయము.

**ఫిబ్రవరి 13 నుండి :** రాజకీయ నాయకులకు ప్రమాదములు. పవిత్ర స్థలములందు అవాంఛనీయ ఘటనలు. కమ్యూనికేషన్లకు అంతరాయములు. ఇన్‌కమ్ టాక్స్ దాడులు. విషజంతువులచే ప్రమాదములు.

**మార్చ్ 13 నుండి :** రాజకీయ నాయకులకు విదేశీ ప్రయాణములు. మంత్రుల శాఖలలో లేదా పరిపాలనా వ్యవస్థలలో మార్పులు ఉండును. కొన్నితావుల ఆకస్మిక వర్షసూచన. రైలు లేదా వాహన ప్రమాదములు.







## శ్రీ ప్లవ లో భారతదేశ భవిష్యత్

| | | | |
|---|---|---|---|
| | | లగ్నము 08° రాహు 05° | కుజ 07° |
| | స్వతంత్ర భారత ఆవిర్భావ కుండలి 15-08-1947 శుక్రవారము గం॥ 00.00 న్యూఢిల్లీ | | రవి 28° చంద్ర 04° బుధ 14° శుక్ర 22° శని 20° |
| | | | |
| | కేతు 05° | గురు 26° | |

| | | | |
|---|---|---|---|
| బుధ24° లగ్న10° | రవి 00° చంద్ర21° శుక్ర05° | కుజ30° రాహు19° | |
| గురు 01° | జగల్లగ్నకుండలి 13-04-2021 మంగళవారము తె॥ఝామను 5-04 న్యూఢిల్లీ | | |
| శని 18° | | | |
| | కేతు19° | | |

వర్తమానమున భారతదేశమునకు చంద్ర మహాదశ నడుస్తున్నది. ఇందు ది.6-09-2021 వరకు శని భుక్తి నడుచును. శని కన్యలో బుధుడు సంచరిస్తున్నాడు. రవి-శుక్ర-శనులు బుధుని నక్షత్రాలలో సంచరిస్తున్నారు. భుక్తినాథుడు ఉన్న నక్షత్రాధిపతి బుధుడు, చంద్రుని నుండి 1-3-6-9-12 భావములను ప్రభావితం చేస్తున్నాడు. రవి 2ను, శుక్రుడు 1-3-4-11-12 లను, బలపరుస్తున్నారు. 1+3+6+11 సైనిక బలాన్ని, శత్రువులపై విజయాన్ని సూచిస్తున్నాయి. 1+3+4+6+9+12 ప్రజలకు అనారోగ్యాన్ని, ప్రాణ నష్టములను, వాతావరణ దుర్యోగములను, విమాన ప్రమాదములను, సైనిక నష్టములను కలిగించును. 4+6+9+12 రైతుల, కార్మికుల ఆందోళనలను సూచించును. 3+6+9+12 వైద్య పరిశోధనలను, వ్యాక్సిన్ లను సూచించిననూ 5వ స్థానము లేక పోవడముతో ఈ భుక్తిలో కరోనా నుండి విముక్తి లేదు. 1+2+3+4+6+9+11 క్లిష్ట పరిస్థితులను ఎదుర్కొనే శక్తిని ఇస్తున్నాయి. 4+9 ప్రభుత్వ వ్యతిరేకతను సూచిస్తున్నాయి. 3+4+9+11 పాలకులకు లేదా ప్రధాని గారికి అనారోగ్య సమస్యలను ఇచ్చును. 3+4+11 వాతావరణ లేదా భూకంప విపత్తులను కలిగించును. 3+4+9+12 సునామీ వంటి ప్రమాదములకు దారితీయవచ్చు.

ది.6-09-2021 నుండి బుధ భుక్తి నడుచును. బుధ కన్యలలో గురుడు సంచరిస్తున్నాడు. గురు నక్షత్రములో గురుడు సంచరిస్తున్నాడు. భుక్తినాథుడు ఉన్న నక్షత్రాధిపతి శని, చంద్రుని నుండి 1-7-8 లను

ప్రభావితము చేస్తున్నాడు. గురుడు 5-6-9-10 లను బలపరుస్తున్నారు. 5-8-9-10 ప్రభుత్వములోని ప్రధాన వ్యక్తులకు ప్రాణగండమును, పాలక పక్షమునకు నష్టమును కలిగించును. 1-5-9 కరోనాను లేదా రోగములను సమర్థవంతముగా ఎదుర్కొనును. ధార్మిక వ్యవస్థ బలపడును. కోర్టు తీర్పులు న్యాయాన్ని పరిరక్షించును. 1-5-6-9-10 దేశ గౌరవమును ప్రతిష్ఠను ఇనుమడించును. 1-5-6 చే ప్రముఖ నటీ-నటులకు గండము. 1-6-7-8 విపత్తులను, నావికా, సైనిక ప్రమాదములను, యుద్ధభయమును సూచించును. 8-9-10 ప్రకృతి విపత్తులను, వరదలను, తుఫాన్లను సూచించును.

వర్తమానమున భచక్రదశలందు మకరదశలో రవి 5-05-2021 నుండి 5-05-2022 వరకు నడుచును. రవి(8). రవి ఉన్న నక్షత్రాధిపతి బుధుడు (7-3,12). బుధ ప్రారంభ కక్ష్యాధిపతి గురు(11-4,11). లగ్నము నుండి గురు(7-7,12). 8+3,4,11 వలన ఈ కాలమందు ప్రకృతి విపత్తులను, భూకంపములను సూచిస్తున్నది. 8+3,4,12 అధిక ప్రాణ-ఆస్తి-పశు-పక్ష్యాదుల నష్టములను సూచిస్తున్నది. వంతెనలు-బిల్డింగులు కూలవచ్చును. 8+3,7,12 పొరుగు దేశాలతో యుద్ధమును, విమాన ప్రమాదములను సూచిస్తున్నాయి. 8+4,7 ప్రతిపక్షములో ముఖ్య నేతల మరణమును సూచిస్తున్నది. 8+11,12 అధికార పక్షము మరియు పార్లమెంట్ సభ్యులకు ప్రమాదములను సూచిస్తున్నాయి. 8+3,11 వలన ఆయుఃప్రమాణము పెరుగును. ముఖ్యముగా ఈ కాలమందు రవి-గురుల వలన 8+7,12 ప్రభుత్వ వ్యతిరేకత, విపత్తులు, ఉగ్రవాద చర్యలు, విదేశీ వాణిజ్యములో ఆటంకములు, షేర్లు పడిపోవుట, ప్రముఖ రాజకీయ నాయకులు-స్వామీజీల మరణము. దేశ భద్రతకు సంబంధించిన ముఖ్య విషయములు శతృదేశాలకు చేరుట వంటి సమస్యలు ఉండును.

1. స్వతంత్ర్య భారతదేశ ఆవిర్భావ లగ్నమునకు, జగల్లగ్నము 11వది అగుట చే.... ఎటువంటి విపత్కర సమస్యనైనా భారతదేశం సమర్థవంతముగా ఎదుర్కొంటుంది. శాస్త్రవేత్తలు-కళాకారులు అంతర్జాతీయ పురస్కారములును అందుకుంటారు. భారతదేశము యొక్క యశస్సు పెరుగును.
2. జన్మలగ్న కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 2డింట, శుక్ర నక్షత్రము నందు సంచరించుటచే.... వివిధ ఘటనలచే ప్రజామరణములు అధికమ





గును. ఆహార భద్రతలో లోపములు ఏర్పడును. ప్రకృతి విపత్తులుండును.
3. ధనభావ కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 2డింట కేతు నక్షత్రము నందు సంచరించుటచే.... దేశ ఆర్థిక పరిస్థితి మెరుగు పడును. ఆహార ధాన్యాల ఉత్పత్తి పెరుగును. బ్యాంకింగ్ వ్యవస్థలందు సమూల మార్పులు.
4. తృతీయభావ కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 3డింట చంద్ర నక్షత్రము నందు సంచరించుటచే... సమాచార వ్యవస్థ పటిష్టమగును. మీడియా వ్యవస్థలందు సంస్కరణలు జరుగును. నెట్‌వర్క్ బలపడును.
5. చతుర్థభావ కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 4డింట కుజ నక్షత్రము నందు సంచరించుటచే.... ప్రకృతి విపత్తులచే పంటలు పాడగును. ఉష్ణోగ్రతలు తీవ్రమగును. వాహన ప్రమాదములు అధికమగును.
6. పంచమభావ కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 2డింట కేతు నక్షత్రము నందు సంచరించుటచే.... విద్యావ్యవస్థ పటిష్టమగును. భారతీయ సినిమాకు లేదా కళాకారులకు అంతర్జాతీయ పురస్కారము.
7. షష్టమభావ కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 2డింట శుక్ర నక్షత్రము నందు సంచరించుటచే.... వైద్యరంగమునకు అధిక నిధులు వెచ్చించబడును. ప్రజలు వివిధ వాతారోగములచే, అంటు వ్యాధులచే బాధపడుదురు
8. సప్తమభావ కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 12డింట కుజ నక్షత్రము నందు సంచరించుటచే.... యుద్ధములు తప్పవు. దౌత్యవ్యవహారములు అంతగా ఫలించవు. సెక్స్‌స్కాండల్స్, పుకార్లు, ప్రముఖుల నష్టము.
9. అష్టమభావ కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 1టింట బుధ నక్షత్రము నందు సంచరించుటచే....జల-వాహన-వాయు ప్రమాదములు. యుద్ధభయము. పేరుగల వ్యక్తుల మరణములు. అనవసర సమస్యలు.
10. నవమభావ కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 9దింట బుధ నక్షత్రము నందు సంచరించుటచే.... ధార్మిక వ్యవస్థ బలపడును. శాస్త్ర-సాంకేతిక పరిశోధనలు ఫలించును. దేవాదాయ వ్యవస్థలందు సంస్కరణలు.
11. దశమభావ కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 9దింట, బుధ నక్షత్రము నందు సంచరించుటచే.... ప్రధానమంత్రి గారికి ప్రమాదములు. అధికార పక్షమునకు వ్యతిరేకంగా కుట్రలు. ప్రముఖులకు అనారోగ్యము.
12. లాభభావ కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 1టింట బుధ నక్షత్రము నందు సంచరించుటచే.... దేశ వ్యతిరేక చర్యలు సమర్థవంతముగా అణచి

వేయబడును. పార్లమెంట్ నందు నూతన సంస్కరణ బిల్లులు ఆమోదం.
13. వ్యయభావ కక్ష్యాధిపతి, జగల్లగ్న కుండలి నందు 12డింట కుజ నక్షత్రము నందు సంచరించుటచే.... నిఘా వ్యవస్థలో దేశ ద్రోహులు ఉందురు. ఉగ్రవాద చర్యలు-ఖైదీల మాయం-ఆసుపత్రులలో ప్రమాదములు.

**2021 ఏప్రిల్ 13 నుండి :** వాతావరణ విపత్తులు. సైనికులకు ప్రమాదము. ప్రముఖులకు అస్వస్థత. అధిక ఉష్ణోగ్రతలు. అనారోగ్యములు.
**మే 13 నుండి :** ఆర్థిక విజయములు. నూతన సంస్కరణలు. శాస్త్ర-సాంకేతిక పరిశోధనలు. విదేశీ దౌత్యములు. సంచలన తీర్పులు.
**జూన్ 13 నుండి :** ప్రతికూల వాతావరణము. రైలు ప్రమాదము. ఉగ్రవాదుల ముప్పు. పోలీసులు-సైనికులకు ప్రమాదము. విచార ఘటనలు.
**జూలై 13 నుండి :** రాజకీయ నాయకులకు-మంత్రులకు ప్రమాదము. ప్రకృతి విపత్తులు. కొన్నితావుల భారీ వర్షములు. తీరప్రాంత అరిష్టములు.
**ఆగస్ట్ 13 నుండి :** వాతావరణ మూలక నష్టములు. కళాకారులకు గుర్తింపు. ప్రముఖ స్త్రీ లేదా కళాకారిణి కాలము చేయును. ఆర్థిక నేరాలు.
**సెప్టెంబర్ 13 నుండి :** ప్రధానికి అస్వస్థత. వాతావరణ విపత్తులు. సముద్రము పొంగును. కొన్నితావుల వరదలు. వైమానిక ప్రమాదములు.
**అక్టోబర్ 13 నుండి :** ప్రముఖుల ఇంట శుభకార్యములు. దేశ ప్రధాని విదేశీ ప్రయాణము. ఆర్థిక సంస్కరణలు. నటులకు గుర్తింపు.
**నవంబర్ 13 నుండి :** 4-3,8 + 2-11,12. తుఫాన్ లేదా భూకంప ప్రమాదము. వాహన-రైలు ప్రమాదములు. ఆర్థిక నేరగాళ్ళకు జైలుశిక్షలు.
**డిసెంబర్ 13 నుండి :** 11-2,9 + 9-1,10. ఆర్థిక విజయములు. సంచలన తీర్పులు. ప్రధాని లేదా రాష్ట్రపతికి అస్వస్థత. శాస్త్రపురోగతి.
**2022 జనవరి 13 నుండి :** 9-1,10 + 3-6. సైనిక-నావిక-వైమానిక విజయములు. దేశ రక్షణ వ్యవస్థ పటిష్టమగును. ప్రధానికి అస్వస్థత.
**ఫిబ్రవరి 13 నుండి :** 2-11,12 + 12-5. అంతర్జాతీయ ఖైదీల మార్పిడి. విద్యార్థులకు ప్రమాదములు. విదేశీ సమన్వయము. నిఘానేత్రం.
**మార్చ్ 13 నుండి :** క్రీడా విజయములు. నిత్యావసర వస్తు ధరలు నియంత్రణ. వీటో అధికారమును పొందవచ్చు. దేశ గౌరవము పెరుగును.





## శ్రీ ప్లవ (2021-22) లో గ్రహముల రాశి ప్రవేశ సమయములు

### సూర్యుడు

సంవత్సరాది నుండి మీనము

| | | |
|---|---|---|
| ఏప్రిల్ | 13 మేషము | తె॥5-04 |
| మే | 14 వృషభము | రా॥1-59 |
| జూన్ | 15 మిధునము | ఉ॥8-37 |
| జూలై | 16 కర్కాటకము | రా॥7-29 |
| ఆగస్ట్ | 16 సింహము | తె॥3-52 |
| సెప్టెంబర్ | 16 కన్య | తె॥3-46 |
| అక్టోబర్ | 17 తుల | ప॥3-42 |
| నవంబర్ | 16 వృశ్చికము | ప॥3-30 |
| డిసెంబర్ | 15 ధనుస్సు | తె॥6-10 |
| జనవరి | 14 మకరము | సా॥4-55 |
| ఫిబ్రవరి | 12 కుంభము | రా॥5-54 |
| మార్చ్ | 14 మీనము | రా॥2-45 |

### కుజుడు

సంవత్సరాది నుండి వృషభ రాశి నందు.

| | | |
|---|---|---|
| ఏప్రిల్ | 13 మిధునము | తె॥5-18 |
| జూన్ | 02 కర్కాటకము | ఉ॥10-48 |
| జూలై | 20 సింహము | రా॥9-45 |
| సెప్టెంబర్ | 09 కన్య | ఉ॥7-41 |
| అక్టోబర్ | 21 తుల | తె॥5-36 |
| డిసెంబర్ | 05 వృశ్చికము | ఉ॥9-24 |
| జనవరి | 16 ధనుస్సు | రా॥7-50 |
| ఫిబ్రవరి | 26 మకరము | రా॥7-04 |

### బుధుడు

సంవత్సరాది నుండి మీనరాశి నందు.

| | | |
|---|---|---|
| ఏప్రిల్ | 16 మేషము | రా॥10-03 |
| మే | 01 వృషభము | ఉ॥6-52 |
| మే | 26 మిధునము | సా॥5-39 |
| మే | 29 వక్రారంభము | తె॥3-58 |
| జూన్ | 02 వృషభము(వ) | సా॥4-39 |
| జూన్ | 22 వక్రం ఆఖరు | తె॥3-25 |
| జూలై | 07 మిధునము | ప॥1-27 |
| జూలై | 25 కర్కాటకము | ప॥12-47 |
| ఆగస్ట్ | 08 సింహము | తె॥2-43 |
| ఆగస్ట్ | 26 కన్య | ప॥12-52 |
| సెప్టెంబర్ | 22 తుల | మ॥1-31 |
| సెప్టెంబర్ | 27 వక్రారంభము | ఉ॥10-34 |
| అక్టోబర్ | 01 కన్య(వక్రం) | రా॥10-17 |
| అక్టోబర్ | 18 వక్రం ఆఖరు | రా॥8-40 |
| నవంబర్ | 02 తుల | ఉ॥11-28 |
| నవంబర్ | 21 వృశ్చికము | ఉ॥6-17 |
| డిసెంబర్ | 10 ధనుస్సు | ఉ॥7-34 |
| డిసెంబర్ | 29 మకరము | ప॥1-06 |
| జనవరి | 14 వక్రారంభము | సా॥5-04 |
| ఫిబ్రవరి | 04 వక్రం ఆఖరు | ఉ॥9-36 |
| మార్చ్ | 06 కుంభము | ప॥12-57 |
| మార్చ్ | 24 మీనము | ప॥12-11 |

### గురుడు

సంవత్సరాది నుండి కుంభరాశి నందు

| | | |
|---|---|---|
| జూన్ | 20 వక్రారంభము | రా॥7-59 |
| సెప్టెంబర్ | 13 మకరము(వ) | ప॥12-20 |
| అక్టోబర్ | 18 వక్రం ఆఖరు | ఉ॥10-07 |
| నవంబర్ | 21 కుంభము | రా॥10-26 |
| ఫిబ్రవరి | 17 పశ్చాదస్తం | తె॥3-00 |
| మార్చ్ | 21 ప్రాగుదయం | సా॥4-24 |

### శుక్రుడు

సంవత్సరాది నుండి మేషరాశి నందు

| | | |
|---|---|---|
| మే | 04 వృషభము | ప॥3-19 |
| మే | 28 మిధునము | రా॥1-55 |
| జూన్ | 22 కర్కాటకము | సా॥4-18 |
| జూలై | 17 సింహము | ఉ॥11-25 |
| ఆగస్ట్ | 11 కన్య | ప॥1-34 |
| సెప్టెంబర్ | 05 తుల | తె॥2-56 |
| అక్టోబర్ | 02 వృశ్చికము | ప॥12-01 |
| అక్టోబర్ | 30 ధనుస్సు | సా॥6-43 |
| డిసెంబర్ | 08 మకరము | రా॥8-24 |
| డిసెంబర్ | 19 వక్రారంభము | సా॥4-02 |
| డిసెంబర్ | 29 ధనుస్సు(వ) | రా॥1-45 |
| జనవరి | 04 పశ్చాదస్తం | ఉ॥7-22 |
| జనవరి | 13 ప్రాగుదయం | తె॥5-09 |
| జనవరి | 29 వక్రం ఆఖరు | ప॥2-15 |
| ఫిబ్రవరి | 27 మకరము | ప॥1-37 |
| మార్చ్ | 31 కుంభము | ఉ॥11-04 |

### శని

ఈ సంవత్సరము అంతయూ శని మకర రాశిలో సంచారము చేయును.

| | | |
|---|---|---|
| మే | 23 వక్రారంభము | ప॥1-47 |
| అక్టోబర్ | 11 వక్రము ఆఖరు | ఉ॥6-53 |

### రాహు-కేతువులు

ఈ సంవత్సరమంతయూ రాహువు వృషభ రాశిలోను, కేతువు వృశ్చిక రాశిలోను సంచారము చేయుదురు.

## 2021-22 లో 27 నక్షత్రజులకు సంవత్సర ఫలము

**1.అశ్విని :** 2021లో వివాహము, కోర్టు విజయములు, బాకీలు వసూలగుట, స్త్రీ సౌఖ్యము, ఉద్యోగము. 2022లో తండ్రికి నష్టము, ప్రమాదము.

**2.భరణి :** 2021లో ఉద్యోగ నష్టము, అవమానము, చోరభయము, అనారోగ్యము. 2022లో ఉద్యోగము, కోర్టు విజయము, ఆరోగ్యము.

**3.కృత్తిక :** 2021లో వివాహము, నష్టద్రవ్యలాభము, తీర్థయాత్ర, 2022లో ఆరోగ్యము, శత్రుమిత్రత్వము, ఆర్థికాభివృద్ధి, శుభకార్య విజయములు.

**4.రోహిణి :** 2021లో అధికారుల అనుగ్రహము, గృహ-వాహనాది యోగము, స్థిరాభివృద్ధి. 2022లో కార్యజయము, అనారోగ్యము, స్త్రీ సౌఖ్యం

**5.మృగశిర :** 2021లో అనారోగ్యము, అసహనము, రక్తపోటు, కలహప్రియము, తెగువ. 2022లో ధనలాభము, పరస్త్రీ సౌఖ్యము, విదేశయానం.

**6.ఆరుద్ర :** 2021లో వివాహము, ఉద్యోగము, పదోన్నతి, సన్మానము. 2022లో ప్రమాదములు, తండ్రికి నష్టము, అనారోగ్యము, నిరాభివృద్ధి.

**7.పునర్వసు :** 2021లో కుటంబ కలహములు, వాహన ప్రమాదము, మిత్రవివాదములు. 2022లో తీర్థయాత్ర, కోర్టువిజయము, వివాహము.

**8.పుష్యమి :** 2021లో నూతన వస్తు-వస్త్ర-వాహన-భూషణ లాభము, శుభకార్యములు. 2022లో ధన ఒత్తిడులు, కుటుంబ కలహము, ఖర్చులు.

**9.ఆశ్లేష :** 2021లో అనారోగ్యము, ఉదర-మూత్రకోశ సమస్యలు, ప్రతికూలఘటనలు. 2022లో ఉద్యోగము, గృహనిర్మాణాది యోగములు.

**10.మఖ :** 2021లో ఉద్యోగము, పదోన్నతి, అధికారము, విజయము. 2022లో భార్యబిడ్డల వలన ఆందోళనలు, శారీరక-మానసిక సమస్యలు.

**11పుబ్బ :** 2021లో వైవాహిక సమస్యలు, అనారోగ్యము, కోర్టుగొడవలు, 2022లో బంధు-మిత్రసహకారము, ఆర్థికాభివృద్ధి, శుభసంఘటనలు.

**12.ఉత్తర :** 2021లో గృహ-వాహన యోగములు, అనుకూల సమాచారము. 2022లో వివాహము, దూరప్రయాణము, ఆర్థిక విజయములు.

**13.హస్త :** 2021లో దూర ప్రయాణము, పాతబాకీలు వచ్చుట, ఆరోగ్యము. 2022లో అభీష్టసిద్ధి, వివాహము, సంతానము, స్త్రీల సహకారములు.







**14.చిత్త :** 2021లో ఆర్థిక-కుటుంబ-శారీరక-మానసిక సమస్యలు, వైద్య సంప్రదింపులు. 2022లో అందుబాటుకు ధనము సర్దుబాటగును.

**15.స్వాతి :** 2021లో ఉద్యోగము, శత్రుజయము, ఆరోగ్యము, ఆర్థికాభివృద్ధి. 2022లో అశాంతి, భవిష్యత్ గురించి ఆందోళన, వాహన ప్రమాదం.

**16.విశాఖ :** 2021లో తండ్రికి అనారోగ్యం, కోర్టు సమస్యలు, ఖర్చులు. 2022లో దైవానుగ్రహం, ఆర్థికాభివృద్ధి, భూమి-గృహ-వస్తు యోగములు.

**17.అనురాధ :** 2021లో వివాహాది శుభకార్యములు, ఆరోగ్యము, ధనలాభము. 2022లో ఉద్యోగ సమస్యలు, అధికారులతో పేచీలు. నింద.

**18.జ్యేష్ఠ :** 2021లో ప్రయాణములో ఇబ్బందులు, వృథా ప్రయాసలు, ఉదర సమస్యలు. 2022లో అభీష్ట సిద్ధి, శత్రువిజయములు, పదవీ ప్రాప్తి.

**19.మూల :** 2021లో ఉద్యోగము, అధికారుల అనుగ్రహము, పదోన్నతి. 2022లో తల్లికి అనారోగ్యము, గృహములో అశాంతి, వాహన సమస్య.

**20.పూర్వాషాఢ :** 2021లో ఆర్థిక-మానసిక సమస్యలు, కుటుంబ కలహములు. 2022లో వివాహాది శుభకార్యములు, రాజకీయ పరపతి.

**21.ఉత్తరాషాఢ :** 2021లో సన్మాన-సత్కారములు, ఆర్థికాభివృద్ధి, మిత్రవినోదము. 2022లో నూతన ఉద్యోగ-వ్యాపారములు, ప్రయాణము.

**22.శ్రవణము :** 2021లో ఆపదవిమోచనము, దైవ సందర్శనములు, అనూహ్యలబ్ధి. 2022లో వివాహాది శుభకార్యములు, తల్లికి అనారోగ్యము.

**23.ధనిష్ఠ :** 2021లో వాస్తునష్టములు, స్థానచలనము, వాహన ప్రమాదము. 2022లో శుభకార్యములు, స్థిరచరాస్తుల వృద్ధి, పెద్దల అనుగ్రహము.

**24.శతభిషము :** 2021లో వివాహాది శుభకార్యములు, కుటుంబవృద్ధి, మిత్రసహకారములు. 2022లో అనారోగ్యము-అశాంతి-ప్రమాదములు.

**25.పూర్వాభాద్ర :** 2021లో అనారోగ్యము, చర్మ-నరముల సమస్యలు. 2022లో ఉద్యోగలాభము, ఆరోగ్యము, దైవానుగ్రహము, ధనలబ్ధి.

**26.ఉత్తరాభాద్ర :** 2021లో స్వస్థత, వివాదవిజయము, దూర ప్రయాణము. 2022లో పనులందు ఆలశ్యములు, వివాదములు, అనారోగ్యము.

**27.రేవతి :** 2021లో అశాంతి, మానసిక సమస్యలు, భవిష్యత్తు గురించి ఆందోళనలు. 2022లో శుభకార్యములు, ఆర్థికాభివృద్ధి, విజయములు.

# 2021-22 లో రోజువారీ వర్షపాతము

ఈ సంవత్సరము మేఘాధిపత్యము **"కుజుని"**కి పట్టుట వలన సామాన్య వర్షపాతము, భయానక వాతావరణము, అతి లేదా అనావృష్టి, వడగండ్లు-పిడుగుపాటులు, వేసవిలో రికార్డుస్థాయి ఉష్ణోగ్రతలు, పంటలకు అగ్గితెగుళ్ళు మొదలగు ఫలితములుండును. ఈ సంవత్సరము వర్షాకాలములో... **గురు** గ్రహము జల-అమృత నాడులందు, **శని** గ్రహము అమృత నాడి నందు, **రాహు- కేతువులు** వాయు-అతివాయు నాడులందు సంచరించుట వలన... వర్షాకాలమందు గాలులుతో కూడిన భారీ వర్షములు కురియుటయే కాక ముంబాయి-చెన్నై-హైదరాబాదు-ఢిల్లీ వంటి మహా నగరాలు ముంపుకు గురగును. ద్వాదశనాగులలో **"సుబుద్ధము"** నామక సర్పము ఉదయించుట వలన... సస్యానుకూల వర్షములు కురియును. **"ఆవర్తనము"** అను పేరుగల మేఘము **"మేరు"** పర్వతమునకు **ఊర్ధ్వ** దిక్భాగమందు ఉదయించుట వలన... ఉరుములు-మెఋపులుతో కూడిన వర్షములు కురియును. దేశమందు అన్ని ప్రాంతములందు వాతావరణమూలక భయాందోళనలు కలుగును. దక్షిణాది రాష్ట్రములలో భారీ నుండి అతిభారీ వర్షములు ఉంటాయి.

**2021 ఏప్రిల్ :** **13.**ఎండ **14.**ఉష్ణగాలి **15.**మబ్బులు **16.**ఉష్ణగాలి **17.**మబ్బులు-జల్లులు **18.**గాలి-మబ్బులు **19.**జల్లులు **20.**మబ్బులు **21.**గాలి-వర్షం **22.**వర్షం **23.**వర్షం **24.**వర్షం **25.**మబ్బులు **26.**ఉష్ణ గాలి **27.**గాలి-మబ్బులు **28.**తుఫాన్ **29.**గాలి-వర్షము **30.**గాలులు.

**మే :** **1.**మబ్బులు **2.**గాలి-జల్లులు **3.**జల్లులు **4.**వర్షము **5.**అల్పపీడనము **6.**గాలి-జల్లులు **7.**గాలి-మబ్బులు **8.**మబ్బులు **9.**ఉష్ణగాలి **10.**ఉష్ణగాలి **11.**గాలి-మబ్బులు **12.**తుఫాన్ **13.**గాలి-జల్లులు **14.**ఉష్ణము **15.** మబ్బులు-జల్లులు **16.**గాలి-జల్లులు **17.**జల్లులు **18.**వర్షము **19.** మబ్బులు-జల్లులు **20.**వర్షము **21.**మబ్బులు **22.**జల్లులు **23.**గాలి-మబ్బు **24.**ఉడుకు **25.**మబ్బు **26.**ఉష్ణగాలి **27.**జల్లులు **28.**ఉష్ణము **29.**మబ్బులు **30.**జల్లులు **31.**వర్షము

**జూన్ :** **1.**వర్షము **2.**జల్లులు **3.**వర్షము **4.**జల్లులు **5.**జల్లులు **6.**గాలి **7.**గాలి **8.**గాలి-జల్లులు **9.**ఉడుకు **10.**జల్లులు **11.**మబ్బులు **12.**వర్షము **13.**జల్లులు **14.**వర్షము **15.**వర్షము **16.**జల్లులు **17.**జల్లులు





**18.**జల్లులు **19.**వర్షము **20.**ఉడుకు **21.**గాలి **22.**వర్షము **23.**అల్పపీడనము **24.** మబ్బులు **25.**జల్లులు **26.**వర్షము **27.**వర్షము **28.**వర్షము **29.**వర్షము **30.**మబ్బులు-జల్లులు

**జూలై :** **1.**జల్లులు **2.**వర్షము **3.**వర్షము **4.**గాలి-మబ్బులు **5.**గాలి **6.**గాలి-వర్షము **7.**గాలి-మబ్బులు **8.**జల్లులు **9.**వర్షము **10.**వర్షము **11.**వర్షము **12.** వర్షము **13.**వర్షము **14.**జల్లులు **15.**జల్లులు **16.**వర్షము **17.**మబ్బులు **18.**గాలి **19.**గాలి **20.**గాలి-వర్షము **21.**జల్లులు **22.** జల్లులు **23.**వర్షము **24.**వర్షము **25.**వర్షము **26.**వర్షము **27.**వర్షము **28.**వర్షము **29.**వర్షము **30.**జల్లులు **31.**జల్లులు.

**ఆగస్ట్ :** **1.**జల్లులు **2.**గాలి **3.**జల్లులు **4.**జల్లులు **5.**వర్షము **6.**వర్షము **7.**వర్షము **8.**వర్షము **9.**వర్షము **10.**వర్షము **11.**వర్షము **12.**వర్షము **13.**జల్లులు **14.**మబ్బులు **15.**గాలి **16.**గాలి **17.**గాలి-జల్లులు **18.** మబ్బులు **19.**వర్షము **20.**జల్లులు **21.**వర్షము **22.**వర్షము **23.**వర్షము **24.**వర్షము **25.**జల్లులు **26.**జల్లులు **27.**మబ్బులు **28.**జల్లులు **29.**గాలి **30.**గాలి-జల్లులు **31.**మబ్బులు.

**సెప్టెంబర్ :** **1.**మబ్బులు **2.**వర్షము **3.**జల్లులు **4.**వర్షము **5.**వర్షము **6.**వర్షము **7.**మబ్బులు **8.**మబ్బులు **9.**జల్లులు **10.**ఎండ **11.**గాలి **12.**గాలి **13.**పెనుగాలి **14.**శీతగాలి **15.**మబ్బులు **16.**వర్షము **17.**శీతలం **18.**వర్షము **19.**జల్లులు **20.**తేమగా **21.**మబ్బులు **22.**ఎండ **23.**మబ్బులు **24.**శీతగాలి **25.**శీతగాలి **26.**శీతగాలి **27.**శీతగాలి **28.**మబ్బులు **29.**జల్లులు **30.**వర్షము.

**అక్టోబర్ :** **1.**శీతగాలి **2.**వర్షము **3.**వర్షము **4.**జల్లులు **5.**జల్లులు **6.**పొడిగా **7.**మబ్బులు **8.**శీతగాలి **9.**శీతగాలి **10.**శీతగాలి **11.**శీతగాలి **12.**ఎండ **13.**మబ్బులు **14.**జల్లులు **15.**శీతలం **16.**వర్షము **17.** మబ్బులు **18.**మబ్బులు **19.**మబ్బులు **20.**మబ్బులు **21.**శీతగాలి **22.**అల్పపీడనము **23.**శీతగాలి **24.**గాలి-మబ్బులు **25.**పొడిగా **26.**మబ్బులు **27.**జల్లులు **28.**వర్షము **29.**వర్షము **30.**వర్షము **31.**జల్లులు.

**నవంబర్ :** **1.**జల్లులు **2.**శీతగాలి **3.**పొడిగా **4.**మబ్బులు **5.**శీతగాలి **6.**శీతగాలి **7.**శీతగాలి **8.**ఎండ **9.**మబ్బులు **10.**శీతగాలి **11.**వర్షము

**12.**మబ్బులు **13.**వర్షము **14.**శీతగాలి **15.**తేమగా **16.**మబ్బులు **17.**తుఫాన్ **18.**గాలి-జల్లులు **19.**గాలి-జల్లులు **20.**మబ్బులు **21.**గాలి **22.**పొడిగా **23.**చలిగాలి **24.**గాలి-జల్లులు **25.**వర్షము **26.**వర్షము **27.**వర్షము **28.**మబ్బులు **29.**తేమగా **30.**శీతగాలి.

**డిసెంబర్ :** **1.**పొడిగా **2.**జల్లులు **3.**శీతగాలి **4.**శీతలం **5.**పెనుగాలి **6.**పెనుగాలి **7.**శీతలం **8.**వర్షము **9.**వర్షము **10.**వర్షము **11.**వర్షము **12.**చలిగాలి **13.**ఎండ **14.**పెనుగాలి **15.**గాలి **16.**మబ్బులు **17.**శీతలం **18.**పొగమంచు **19.**పొడిగా **20.**మబ్బులు **21.**శీతగాలి **22.**వర్షము **23.**వర్షము **24.**వర్షము **25.**వర్షము **26.**తేమగా **27.**తేమగా **28.**పొడిగా **29.**శీతగాలి **30.**శీతగాలి **31.**శీతగాలి.

**2022 జనవరి :** **1.**శీతగాలి **2.**మబ్బులు **3.**జల్లులు **4.**శీతగాలి **5.**వర్షము **6.**వర్షము **7.**జల్లులు **8.**జల్లులు **9.**మబ్బులు **10.**పొడిగా **11.**గాలి **12.**మంచు **13.**మంచు **14.**మబ్బులు **15.**మబ్బులు **16.** జల్లులు **17.**శీతగాలి **18.**మంచు **19.**వర్షము **20.**తుషారం **21.**తుషారం **22.**మంచు **23.**మంచు **24.**తేమగా **25.**ఎండ **26.**మబ్బులు **27.**శీత గాలి **28.**శీతగాలి **29.**పొగమంచు **30.**పొగమంచు **31.**తుషారం.

**ఫిబ్రవరి :** **1.**పొగమంచు **2.**తుషారం **3.**తుషారం **4.**తేమగా **5.**మంచు **6.**మబ్బులు **7.**ఎండ **8.**గాలి **9.**గాలి-మబ్బులు **10.**శీతలం **11.** మబ్బులు **12.**శీతగాలి **13.**జల్లులు **14.**తుషారం **15.**జల్లులు **16.**వర్షము **17.**వర్షము **18.**మబ్బులు **19.**జల్లులు **20.**తేమగా **21.**ఎండ **22.** మబ్బులు **23.**శీతగాలి **24.**శీతగాలి **25.**శీతగాలి **26.**మబ్బులు **27.**జల్లులు **28.**జల్లులు.

**మార్చ్ :** **1.**వర్షము **2.**వర్షము **3.**జల్లులు **4.**మబ్బులు **5.**మబ్బులు **6.**పొడిగా **7.**ఎండ **8.**మబ్బులు **9.**గాలి **10.**తేమగా **11.**పొడిగా **12.** మబ్బులు **13.**జల్లులు **14.**వర్షము **15.**వర్షము **16.**వర్షము **17.**మబ్బులు **18.**మబ్బులు **19.**పొడిగా **20.**పొడిగా **21.**పొడిగా **22.**మబ్బులు **23.**గాలి **24.**పొడిగా **25.**పొడిగా **26.**మబ్బులు **27.**తేమగా **28.**జల్లులు **29.** వర్షము **30.**జల్లులు **31.**మబ్బులు

**ఏప్రిల్ :** **1.**జల్లులు.





## సరుకుల ధరలు 2021-2022

**2021 ఏప్రిల్ :** ఈ నెల **3-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు పెరుగును. **1-2-5-6-7** కూటములకు చెందిన వస్తువుల ధరలు తగ్గును. **4-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు నిలకడగా సాగును.

**మే :** ఈ నెల **7వ** కూటమికి చెందిన వస్తువుల ధరలు అధికముగా పెరుగును. **4-5-6-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు స్వల్పముగా పెరుగును. **3-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు నిలకడగా సాగును. **1-2** కూటములకు చెందిన వస్తువుల ధరలు తగ్గును.

**జూన్ :** ఈ నెల **2-3-5-6** కూటములకు చెందిన వస్తువుల ధరలు పెరుగును. **7-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు నిలకడగా సాగును. **1-4-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు తగ్గును.

**జూలై :** ఈ నెల **4-5-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు అధికముగా పెరుగును. **2-6-7-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు స్వల్పముగా పెరుగును. **1-3** కూటములకు చెందిన వస్తువుల ధరలు గత నెల కన్నా తగ్గును.

**ఆగస్ట్ :** ఈ నెల **2-6-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు స్వల్పముగా పెరుగును. **3-4-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు నిలకడగా ఉండును. **1-5-7** కూటములకు చెందిన వస్తువుల ధరలు గత నెల కన్నా తగ్గును.

**సెప్టెంబర్ :** ఈ నెల **7వ** కూటమికి చెందిన వస్తువుల ధరలు బాగా పెరుగును. **2-3-4-5-6-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు స్వల్పముగా పెరుగును. **1-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు గత నెల కన్నా తగ్గును.

**అక్టోబర్ :** ఈ నెల **2-6** కూటములకు చెందిన వస్తువుల ధరలు స్వల్పముగా పెరుగును. **7వ** కూటమికి చెందిన వస్తువుల ధరలు నిలకడగా సాగును. **1-3-4-5-8-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు గత నెల కంటే తగ్గును.

**నవంబర్ :** ఈ నెల **3-4-5-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు బాగా పెరుగును. **6-7** కూటములకు చెందిన వస్తువుల ధరలు స్వల్పముగా పెరుగును. **2వ** కూటమికి చెందిన వస్తువుల ధరలు నిలకడగా

సాగును. **1-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు తగ్గును.

**డిసెంబర్ :** ఈ నెల **3-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు బాగా పెరుగును. **6వ** కూటమికి చెందిన వస్తువుల ధరలు స్వల్పముగా పెరుగును. **2-4-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు నిలకడగా సాగును. **1-5-7** కూటములకు చెందిన వస్తువుల ధరలు తగ్గును.

**2022 జనవరి :** ఈ నెల **2-7-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు బాగా పెరుగును. **4-5-6-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు స్వల్పముగా పెరుగును. **3వ** కూటమికి చెందిన వస్తువుల ధరలు నిలకడగా సాగును. **1వ** కూటమికి చెందిన వస్తువుల ధరలు తగ్గును.

**ఫిబ్రవరి :** ఈ నెల **6-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు బాగా పెరుగును. **3వ** కూటమికి చెందిన వస్తువుల ధరలు స్వల్పముగా పెరుగును. **7వ** కూటమికి చెందిన వస్తువుల ధరలు నిలకడగా సాగును. **1-2-4-5-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు తగ్గును.

**మార్చ్ :** ఈ నెల **2-4-5-6-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు బాగా పెరుగును. **7వ** కూటమి యొక్క వస్తు ధరలు స్వల్పముగా పెరుగును. **1-3-8** కూటములకు చెందిన వస్తువుల ధరలు తగ్గును.

**ఏప్రిల్ :** ఈ నెల **6-8-9** కూటములకు చెందిన వస్తువుల ధరలు బాగా పెరుగును. **4వ** కూటమి యొక్క వస్తు ధరలు నిలకడగా సాగును. **1-2-3-5-7** కూటములకు చెందిన వస్తువుల ధరలు తగ్గును.

## వస్తు కూటముల సంఖ్యలు

1. గోధుమలు-గ్రాసము-బంగారము-ధాన్యము-ఇత్తడిపాత్రలు-కలప-లక్క-ఇంగువ-వెల్లుల్లి-కుసుమలు-ప్లాటినమ్-శొంఠి-మిరియములు-హాట్ చిప్స్-కారము-కెంపులు-రాగులు.
2. బియ్యము-నీరు-కూరగాయలు-ఆకుకూరలు-జొన్నలు-ఇడ్లీరవ్వ-ఉప్పు-వెండి-నూలువస్త్రములు-పాలు-పెరుగు-ఔషధములు-నూకలు తేయాకు-ప్రత్తి గింజలు-ప్రత్తి-కాఫీగింజలు-జలచరములు- కందమూలాది దుంపలు-మైదాపిండి-ఇసుక-శీతలపదార్ధములు-శీతలపానీయములు-జనుము-ముత్యములు-కొబ్బరి-వ్యవసాయ పనిముట్లు-ఉల్లిపాయలు-టీపొడి-సైంధవలవణములు.





3. శనగలు-గోవులు-నెయ్యి-ఎండుఖర్జూరము-పంచదార-అరటిపండ్లు పట్టువస్త్రములు-పసుపు-బంగారుఆభరణములు-పాత్రలు-బెల్లము-తేనె-కండసార-చందనము-ఫలములు-పూజాద్రవ్యములు-ఏనుగులు-అగరు-మిఠాయిలు-పుష్యరాగములు.
4. మినుములు-పశువులు-పాములు-పాదరక్షలు-శరీరకవచములు-పుట్టగొడుగులు-తోలువస్త్రములు-తోలుసంచులు-చర్మవస్తువులు-కుడ్యపాత్రలు-పాదరసము-పొగాకు-మాంసము-ఫాస్ట్‌ఫుడ్స్-ఉప్మారవ్వ-చేపలు-సహజవాయువు-రొయ్యలు-పీతలు.
5. పెసలు-పచారీ లేదా కిరాణా మరియు ఫ్యాన్సీ వస్తువులు-తమలాకులు-ధనియాలు-జీడిపప్పు-చెఱకు-పేపరు-దుప్పట్లు-జీలకర్ర-కంచుపాత్రలు-బాదంపప్పు-మంజిష్టాదులు-పుస్తకములు-షేర్లు-వక్కలు-ఓమ-రంగులు-ఏలకులు-మసాలాదినుసులు-పచ్చళ్ళు-పచ్చకర్పూరము-గుగ్గిలము-సాంబ్రాణి-వేరుశనగ-గసగసాలు-మెంతులు-ప్రింటింగ్‌యంత్రములు-కంప్యూటర్లు-కాలిక్యులేటర్లు-గడియారములు-మరకతములు.
6. అలసందలు-వాహనములు-మత్తుపానీయములు-ఎండుద్రాక్షలు-చింతపండు-శృంగార ఔషధములు-అలంకారవస్తువులు-వస్త్రములు-లోదుస్తులు-సీమవెండిపాత్రలు-నిమ్మకాయలు-సెంట్లు-సబ్బులు-కాస్మోటిక్స్-చర వాణి యంత్రములు-దృశ్యవాణి యంత్రములు-వినోద పరికరములు-వెండి ఆభరణములు-పుష్పములు-అశ్వములు-శీతలీకరణయంత్రములు-ఫ్యాన్లు-కూలర్లు-తలనూనెలు-వజ్రములు.
7. ఉలవలు-పక్షులు-విగ్రహములు-గ్రుడ్లు-మిశ్రమ వస్త్రములు-పంచలోహపాత్రలు-పట్టు-దారములు-మేకలు-గొర్రెలు-రంగురాళ్ళు-మైకా-అభ్రకము-పాలీథీన్‌వస్తువులు-డిస్పోజబుల్‌వస్తువులు-తగరము-జింకు-నార (గోనె) సంచులు-వైఢూర్యములు.
8. నువ్వులు-మట్టి-బొగ్గు-సిమెంట్-శిరోజాలు-శల్యములు-వంటనూనెలు-ఆముదాలు-చలువరాళ్ళు-రబ్బరు-స్టీల్‌పాత్రలు-మట్టిపాత్రలు-జాడీలు-కుంకుళ్ళు-మట్టివిగ్రహములు-అల్యూమినియం(సీమవెండి)-పశువులు-ధూమపాన వస్తువులు-త్రాళ్ళు-ఇనుము-సూదంటురాయి-నీలమణులు-పురుగుమందులు-ఇంధనములు-పెట్రోల్-డీజిలాయిల్-బార్లీ.
9. కందులు-రాళ్ళు-భూములు-మిర్చి-ఆవాలు-కంబళ్ళు-రాగివస్తువులు-ఉన్ని-పులిచర్మాలు-దంతములు-ఎలక్ట్రికల్ వస్తువులు-ఎలక్ట్రానిక్ వస్తువులు-పులిగోళ్ళు-ఇటుకలు-పెంకులు-పగడములు-భారీయంత్రాలు.

# గోచారవశమున శని దుష్ప్రభావము

**1. అర్ధాష్టమశని :** జాతకుని యొక్క జన్మరాశి లగాయతు నాల్గవ(4) రాశిలో గోచారవశమున శని సంచరించుటను **"అర్ధాష్టమశని"** అందురు. ఇది సుమారుగా రెండున్నర సంవత్సరములు ఉంటుంది. ఈ కాలములో జాతకుడు ఆస్తి సంబంధమైన, బంధు సంబంధమైన వివాదాలలో ఇరుక్కొనును. శుభ ప్రయత్నములు బెడిసికొట్టును. తగినంత సుఖము ఉండదు. మాతృ విరోధముగాని, మాతృగండముగాని కల్గును. వ్యాపార సంస్థలు మూతపడును.

**2. అష్టమశని :** జాతకుని యొక్క జన్మరాశి లగాయతు, ఎనిమిదవ (8) రాశిలో గోచారవశమున శని సంచరించుటను **"అష్టమశని"**అందురు. ఇదికూడా సుమారుగా రెండున్నర సంవత్సరములు ఉంటుంది. ఈ కాలములో జాతకుడు ఆర్థికముగా, మానసికముగా, శారీరకముగా తీవ్ర ఇబ్బందులకు గురిఅగును. వాహన ప్రమాదములు, జల గండములు మరియు వివిధరకాల ప్రాణ గండములు కలుగును. స్థానచలనము, వృత్తిభంగము జరుగును.

**3. కంటకశని :** జాతకుని యొక్క జన్మరాశి లగాయితు పదవ(10) రాశిలో గోచారవశమున శని సంచరించుటను **"కంటకశని"** అని అందురు. ఇది కూడా సుమారు రెండున్నర సంవత్సరములు ఉంటుంది. ఈ కాలములో జాతకుడు సాంఘికముగా, రాజకీయముగా అప్రతిష్ఠ పాలగును. వృత్తి భంగము జరుగును. బంధనయోగము, కోర్టు సమస్యలు ఉత్పన్నమగును. అధికారుల ఆగ్రహమునకు గురికావలసి ఉంటుంది.

**4.ఏల్నాటిశని :** ద్వాదశ రాశ్యాత్మకమగు మానవుని జీవితములో ఏడున్నర సంవత్సరముల పాటు శనిగ్రహము చూపు దుష్ప్రభావమును వ్యవహారిక భాషలో **"ఏలినాటిశని"** గా వ్యవహరింతురు.శని ఒక్కొక్క రాశిలో రెండున్నర సంవత్సరముల పాటు సంచరిస్తే... ద్వాదశ రాశులను 30 సం॥లలో చుట్టివచ్చును. అట్టి సమయములో జాతకుని జన్మరాశికి వెనుకగలట్టి రాశి (జన్మరాశి నుండి 12వది) లోనికి శని ప్రవేశించగనే... జాతకునికి ఏలినాటి శని ప్రారంభమైనట్లు గ్రహించాలి. ఆరాశిలో శని రెండున్నర సంవత్సరములు కాలము సంచరిస్తూ.. జాతకునిచే దుర్వ్యయములను చేయిస్తూ బికారిని చేయును. శుభకార్య క్రమములకు అవరోధములను కలిగించును. వ్యాపార, వృత్తి నష్టములను కలుగజేయును. స్థానచలనము, ఆస్తులను అమ్ముకొనుట మొదలగు చెడు ఫలితములు కలుగును. తదుపరి శని జాతకుని జన్మరాశి





(చంద్రుడున్నరాశి) లోనికి ప్రవేశించి... రెండున్నర సంవత్సరముల పాటు తీవ్ర అనారోగ్యములను, అపనిందలను, ప్రమాదము లను కలుగచేయుటకు ప్రయత్నించును. ఆ తదుపరి శని జాతకుని జన్మరాశికి ముందుగల రాశి (జన్మరాశి లగాయతు 2వది) లోనికి ప్రవేశించి రెండున్నర సంవత్సరముల పాటు జాతకునికి తీవ్ర మానసిక క్షోభను, ధన నష్టములను, కుటుంబంలో అశాంతిని, మరణ భయమును కల్గించును.

ఈ విధముగా శని-జాతకుని జన్మరాశి లగాయతు 12,1,2, స్థానము లలో గోచార రీత్యా ఏడున్నర సంవత్సరముల పాటు సంచారము సల్పి.. జాతకుని అనేక విధములు గా బాధలుపెట్టుటను **"ఏలినాటిశని"** అందురు.

**విశేషము :** ఈ ఏలినాటి శని జాతకుని జీవితములో 30 సంవత్సరముల కొకసారి చొప్పున 3 పర్యాయములు వచ్చి.. ఒక్కొక్క పర్యాయము ఏడున్నర సంవత్సరములు ఉండును. అందు మొదటి పర్యాయము ఏలినాటి శనిని **"మంగుశని"** గా వ్యవహరింతురు. ఈ కాలమందు జాతకుడు నానావిధమైన కష్టనష్టములను అనుభవించవలసి ఉంటుంది. రెండవ పర్యాయపు ఏలినాటి శనిని **"పొంగుశని"** గా వ్యవహరింతురు. ఈ కాలమందు జాతకుడు పాల పొంగువలె దినదినాభివృద్ధిని చెందును. మూడవ పర్యాయపు ఏలినాటి శనిని **"మృత్యుశని"** యని వ్యవహరింతురు. ఈ కాలమునందు జాతకుడు దీర్ఘ రోగములచే బాధపడుచూ.. ప్రాణమును విడుచును. ఈ కాలము నందు మారకదశలు రాకుంటే... ప్రాణము నిలుచును. గోచారరీత్యా గురుడు బలముగా ఉన్నప్పుడు.. ఈ ఏలినాటి శని ప్రభావము అంతగా ఉండదు. ఏది ఏమైననూ.. ఏలినాటి శని వచ్చినపుడు తగినన్ని శాంతులను చేయించాలి.

**శాంతివిధానము :** ఏలినాటి శని ప్రభావమునకులోనై విపరీతముగా బాధలు పడుచున్న వారు ఈ క్రింది శాంతులను ఆచరించినయెడల.. బాధలు నివారణయగును.

1. శనిత్రయోదశి పర్వదినమున, తూర్పుగోదావరిజిల్లా నందలి కొత్తపేట తాలూకా, రావులపాలెం మండలములోని **"మందపల్లి"** అను గ్రామములో వేంచేసియున్న శ్రీశనైశ్చరస్వామివారికి తిల,తైలాభిషేకము చేయించి, తిలదానము చేయవలెను.
2. ప్రతి నిత్యము తాను భోజనము చేసేముందు అన్నములో ముడినువ్వులను కలిపి కాకులకుగాని, నల్లకుక్కకుగాని, పెట్టవలెను. శనైశ్చరశాంతితో పాటు భూతశాంతి అగును.

**17.శుభ శకునములు :** ముత్తయిదువు-స్త్రీ-బ్రాహ్మణులు-పంట కాపు-వేశ్య-మంగళ వాయిద్యములు-కల్లుకుండలు-ఫలములు-పుష్ప ములు-గొడుగు-విసనకర్ర-గుర్రము-ఏనుగు-నీటిబిందెలు-అన్నము-పాలు-పెరుగు-మాంసము-శంఖానాదములు-ఘంటానాదములు-నూతన వధూవరులు-చల్లనిగాలి-కోడి-కుక్క-పెంపుడు జంతువులు మొదలైనవి ప్రయాణములో ఎదురువచ్చుట శుభముగా గుర్తించేది.

**18.అశుభ శకునములు :** కాకి అఱుపులు వినుట లేక తన్నుట-విధవాస్త్రీ-నూనెపాత్రలు-భిక్షగాడు-అంగవైకల్యజీవులు-రోగి-ముట్టుస్త్రీ-ఒంటి తుమ్ము-వస్తువులు జారిపడుట-మరచి పోవుట-అపశృతులు కలుగుట- క్రింద పడుట-నేనుకూడా వస్తాననుట-ఈ పూట వెళ్ళవద్దనుట- భోజనము చేసి వెళ్ళమనుట-గాలి-వర్షము-ఉరుములు వచ్చుట-పొగతో కూడిన నిప్పు- కుక్క మొరుగుట-మనసులో సంకోచము -దారిమధ్యలో కలహము మొదలైన అశుభ శకునములు ప్రయాణములో ఎదురుపడినపుడు, ప్రయాణమును విరమించుకొనుట మంచిది. తప్పనిసరై ప్రయాణము చేయవలసి వచ్చిన పుడు..... వెనుకకు వచ్చి, కాళ్ళు కడుక్కొని, కాసేపు కూర్చుని, భగవంతుడిని ప్రార్థించి వెళ్ళవలెను.

**19.ధృవ నక్షత్రములు :** రోహిణి-ఉత్తర-ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్ర నక్షత్రములు.

**20.చర నక్షత్రములు :** పునర్వసు-స్వాతి-శ్రవణము-ధనిష్ఠ-శతభిష నక్షత్రములు.

**21.ఉగ్ర నక్షత్రములు :** భరణి-మఖ-పుబ్బ-పూర్వాషాఢ-పూర్వాభాద్ర నక్షత్రములు.

**22.సాధారణ నక్షత్రములు :** కృత్తిక-విశాఖ నక్షత్రములు.

**23.క్షిప్ర నక్షత్రములు :** అశ్విని-పుష్యమి-హస్త-అభిజిత్ నక్షత్రములు.

**24.మృదు నక్షత్రములు :** మృగశిర-చిత్త-అనురాధ-రేవతి నక్షత్రములు.

**25.దారుణ నక్షత్రములు :** ఆరుద్ర-ఆశ్లేష-జ్యేష్ఠ-మూల నక్షత్ర ములు.

**26.ఊర్ధ్వముఖ నక్షత్రములు :** రోహిణి-ఆరుద్ర-పుష్యమి-ఉత్తర-ఉత్తరాషాఢ-శ్రవణము-ధనిష్ఠ-శతభిషము-ఉత్తరాభాద్ర నక్షత్రములు ఊర్ధ్వముఖము కలవి.

**27.అధోముఖ నక్షత్రములు :** భరణి-కృత్తిక-ఆశ్లేష-మఖ-పుబ్బ-విశాఖ- మూల-పూర్వాషాఢ-పూర్వాభాద్ర నక్షత్రములు అధోముఖ ము కలవి.

**28.తిర్యక్ముఖ నక్షత్రములు:** అశ్విని-మృగశిర-పునర్వసు-హస్త-చిత్త-స్వాతి-అనురాధ-జ్యేష్ఠ-రేవతి నక్షత్రములు తిర్యక్ముఖము కలవి.





## గోచార శుభస్థానములు

గ్రహముల యొక్క సంచారమును "గోచారము" అందురు. జన్మరాశి (చంద్రుడున్న రాశి) నుండి నవగ్రహములు ఈ దిగువ తెలిపిన స్థానములలో సంచరించునపుడు జాతకునికి అనేక శుభఫలితములు కలుగును.

**1.రవి :** జన్మరాశి లగాయతు 3,6,10,11 స్థానములో సంచరిస్తున్నపుడు ఉద్యోగమును, ఉత్సాహమును, ధైర్యమును, కీర్తి-ప్రతిష్ఠలను కలుగ జేయును. మిగతా స్థానములలో చెడు ఫలితములను కలుగజేయును.

**2.చంద్ర :** జన్మరాశి లగాయతు 1,3,6,7,10,11 స్థానములందు మానసిక ఉల్లాసమును, సంతోషమును, స్త్రీసౌఖ్యమును, సుఖభోజనమును కలుగ జేయును. మిగతా స్థానములో దుష్టఫలితములు ఉండును.

**3.కుజ :** జన్మరాశి లగాయతు 3,6,11 స్థానములందు ధైర్యము, ఉత్సాహము, ఋణ విమోచనము, భూలాభము మరియు ఆరోగ్యమును కలుగ చేయును. మిగతా స్థానములలో మంచి ఫలితములు ఉండవు.

**4.బుధ :** జన్మరాశి లగాయతు 2,4,6,8,10,11 స్థానములలో సంఘ గౌరవము, విద్యను, శుభవార్తలను, ధనలాభము మరియు ఆరోగ్యమును కలుగజేయును. మిగతా స్థానములో వ్యతిరేక ఫలములుండును.

**5.గురు :** 2,5,7,9,11 స్థానములందు వ్యవహార జయమును, స్వర్ణవస్తు లాభమును, అధికారమును, పుణ్యక్షేత్ర సందర్శనమును, యశస్సును, సన్మానములను మరియు స్థిరాస్తులను కలిగించును. మిగతా స్థానములందు మంచిది కాదు.

**6.శుక్ర :** 1,2,3,4,5,8,9,11,12 స్థానములందు వివాహమును, స్త్రీసౌఖ్యమును, ఆనందమును, విందు-విలాసాదులను, కీర్తి-ప్రతిష్ఠలను, రాజకీయాధికారమును, వాహన లాభమును కలిగించును. మిగతా స్థానములో చెడు చేయును.

**7.శని :** 3,6,11, స్థానములందు భూగృహ నిర్మాణాదులను, ఉద్యోగమును, విలువైన వస్తులాభమును, అధికారమును కలిగించును. మిగతా స్థానములలో అశుభమును కలుగజేయును. అందు 1,2,12 స్థానములు "ఏలినాటి శని" గాను, 8న "అష్టమశని" గాను, 4న "అర్ధాష్టమశని" గాను, 10న "కంటకశని" గాను విపరీత కష్టములను కలుగజేయును.

**8.రాహు-కేతువులు :** 3,6,11 స్థానములందు వారసత్వ ఆస్తులను మరియు ఆకస్మిక అదృష్టములను, ధనలాభమును, వ్యవహార జయమును ప్రసాదించును. మిగతా స్థానముల యందు చాలాచిక్కులు, చీకాకులను కలిగించును.

స్త్రీలకు జన్మలగ్నమే కాక ప్రధమ ఆర్తవ లగ్నము కూడా భవిష్యత్తును సూచించును.



## ప్రధమ రజోదర్శన శుభాశుభ సమయములు

**1.శుభ నక్షత్రములు :** అశ్విని-రోహిణి-మృగశిర-ఆరుద్ర-పునర్వసు-పుష్యమి-ఉత్తరాత్రయము-చిత్త-స్వాతి-విశాఖ-అనూరాధ-శ్రవణము -ధనిష్ఠ- రేవతి తారలు శుభమైనవి.

**2.శుభ తిథులు :** 2,3,5,7,10,11,13, బహుళ పాడ్యమి, పూర్ణిమా తిథులు శుభమైనవి.

**3.శుభ వారములు :** సోమ,బుధ,గురు, శుక్ర వారములు మంచివి.

**4.శుభ మాసములు :** వైశాఖము, శ్రావణము, ఆశ్వయుజము, మార్గశిరము, మాఘము మరియు ఫాల్గుణ మాసములందు శుభ ఫలములు కలుగును

**5.శుభ లగ్నములు :** వృషభ, మిధున, కర్కాటక, కన్య, తుల, ధనూ, మీన లగ్నములు శుభమైనవి. మతాంతరమున సింహ, వృశ్చిక ములు కూడా మంచివని చెప్పుదురు.

**గమనిక :** పైనపేర్కొన్న శుభ తిథులు, వారములు, నక్షత్రములు, మాస ములు లగ్నములు కాక... మిగిలిన తిథి, వార, నక్షత్ర, మాస, లగ్నములలో కన్య పుష్పవతి అయినయెడల... శాంతులు, దానములు చేయించాలి. రజో దర్శన సమయమును బట్టి రజోలగ్నమును నిర్ణయించి, గ్రహబలమును బాగుగా పరిశీలించి... కన్యయొక్క భవిష్యత్తును నిర్ణయించినయెడల... ఫలితములు అనుభవమునకు సరిపోవును.

## బాలారిష్ట మహాదశలు

జన్మలగ్న రీత్యా శని 1టిన (లగ్నమందు), సూర్యుడు 2 లేక 5 వ స్థాన మున, గురుడు 3వ ఇంట, బుధుడు 4 లేక 12 ఇంట, శుక్రుడు 6వ స్థాన మున, కుజుడు 7న, చంద్రుడు 8న, రాహువు 9న ఈ స్థానములందు న్నచో... అరిష్ట ప్రదులగుదురు. అరిష్టము లేక మారకము చేయక విడిచి పెట్టినచో వారివారి మహాదశలు వచ్చినపుడు అరిష్టము చేయుదురు. అయితే ఈ ఫలితములను స్థూలముగా గ్రహించవలెను. సూక్ష్మ ఫలితములకై జాతకచక్రమును పూర్తిగా పరిశీలన కావించి, నిర్ధారణకు రావలయును. అరిష్ట సూచన ఉన్నచో తప్పనిసరిగా శాంతులు, మృత్యుంజయ జపమును జరిపించవలెను.



పుట్టుమచ్చలలో రంగు-పరిమాణము-ఆకృతిలచే ఫలితములలో మార్పులుండును



## పుట్టుమచ్చలు - ఫలితములు

| | | |
|---|---|---|
| శిరస్సున | - | ధైర్యవంతుడు,రాజకీయలాభము. |
| నుదుటన | - | మేధావి, ప్రజ్ఞావంతుడు |
| కనుబొమ్మలమీద | - | శీఘ్రవివాహము, పురుషసంతతి |
| కన్నులలో | - | స్వార్జితధనార్జన (కుడికన్నుమేలు) |
| ముక్కుమీద | - | కోపిష్ఠి, ధర్మపరుడు |
| చెవులమీద | - | ఆయుర్దాయలాభము |
| పెదవులమీద | - | భోజనప్రియులు, కాముకులు |
| చెక్కిళ్ళు | - | సుఖదాంపత్యము |
| కణతలమీద | - | సౌందర్యఆరాధన |
| గడ్డముమీద | - | ధనసంపాదనాపరులు |
| కంఠముమీద | - | వివాహలాభము,ప్రధమములో పురుషసంతానము |
| వక్షముమీద | - | మంచిప్రవర్తన |
| హృదయముమీద | - | ప్రేమవ్యవహారాలు ఎక్కువ |
| కుడిభుజము | - | కీర్తి, పేరుప్రతిష్ఠలు |
| ఎడమభుజము | - | తరచూకలహములు |
| చేతులు | - | వ్యవసాయలాభము |
| అరిచేతులు | - | కల్పనాశక్తి, రచయితలు |
| చేతిబొటనవ్రేలు | - | స్వయంవిద్య,ఇష్టార్ధలాభము |
| పొట్టమీద | - | రహస్యములుదాచేవారు |
| నాభిమీద | - | ధనలాభము, పొదుపరి |
| పొత్తికడుపు | - | అనారోగ్యము |
| పిరుదులు | - | యోగమంత్రసాధనలు |
| మర్మాంగము | - | మన్మధసౌఖ్యము |
| వృషణములు | - | వాహనయోగము |
| కుడివృషణము | - | పురుషసంతతి |
| ఎడమవృషణము | - | స్త్రీసంతతి అధికము |
| కుడితొడ | - | ధనలాభము, లక్షాధికారి |
| ఎడమతొడ | - | స్త్రీ లంపటుడు - చంచలమనస్సు |
| మోకాళ్ళు | - | నాటకములపిచ్చి |
| కాలిపిక్కలు | - | శరీరశ్రమ ఎక్కువ |
| పాదములు | - | సంచారవృత్తి |
| అరికాళ్ళు | - | వివేకము, యోచనాశక్తి |

మననము చేయుకొలదీ మంత్రము యొక్క శక్తి పెరుగును.



## మేషాది ద్వాదశ రాశుల వారికి నిత్య జప మంత్రములు

1. మేషరాశి : ఓం హ్రీం లక్ష్మీనారాయణాయ నమః

2. వృషభరాశి : ఓం గోపాలాయ ఉత్తర ధ్వజాయ నమః

3. మిథునరాశి : ఓం క్లీం కృష్ణాయ నమః

4. కర్కాటకరాశి: ఓం హిరణ్యగర్భాయ అవ్యక్తరూపిణే నమః

5. సింహరాశి : ఓం క్లీం బ్రహ్మణే జగదాధారాయ నమః

6. కన్యారాశి : ఓం నమో హ్రీం పీతాంబరాయ నమః

7. తులారాశి : ఓం తత్త్వనిరంజనాయ తారకరామాయ నమః

8. వృశ్చికరాశి : ఓం నారాయణాయ నరసింహాయ నమః

9. ధనుస్సురాశి : ఓం శ్రీం దేవకృష్ణాయ ఊర్ధ్వదంతాయ నమః

10. మకరరాశి : ఓంశ్రీం వత్సలాయ నమః

11. కుంభరాశి : ఓం శ్రీం ఉపేంద్రాయ అచ్యుతాయ నమః

12. మీనరాశి : ఓం క్లీం ఉద్ధృతాయ ఉద్ధారిణే నమః

**గమనిక :** ఆయా రాశులవారు,ఆయా రాశులకు చెప్పబడిన మంత్రములను ప్రతి నిత్యము 108సార్లు జపించుచుండిన యెడల ఆయురారోగ్య ఐశ్వర్యములను పొందుటయే కాక గ్రహ బాధల నుండి విముక్తులగుదురు అనుటలో సందేహములేదు.



ప్రాంతీయ భేదములచే ఆచార-వ్యవహారాలలో మార్పులుండును.



## వివాహానంతరము చేయరాని కార్యములు

ఒక కుటుంబములో ఒకనికి వివాహము జరిగిన యెడల... ఆ కుటుంబములోని వారు ఆరు మాసములు దాటక ముందు చెవులు కుట్టుట, ఉపనయనము, తీర్థయాత్రలు, నూతన గృహప్రవేశము, నూతన వ్రత గ్రహణము, ఉద్యాపనము మొదలగు కార్యము లను జరుపగూడదు. ఒక సంవత్సరము వరకూ నూతన శంఖుస్థాపన చేయరాదు.

## మరణమునకు తిథ్యాది దోషములు

1,2,3,6,11,12,13,14,30 ఈ తిథుల యందును, ఆది,మంగళ,శుక్ర,శనివారముల యందును,కృత్తిక,రోహిణి,మృగశిర,పునర్వసు,మఖ,ఉత్తరఫల్గుణి,చిత్త,విశాఖ,ఉత్తరా షాఢ,ధనిష్ఠ,శతతార,పూర్వాభాద్ర,ఉత్తరాభాద్ర, రేవతి ఈ నక్షత్రముల యందును మనుజులకు మృతి సంభవించిన యెడల..ఆ మృతి కలిగిన గృహమునకు దోషము కలుగును. కేవలము తిథుల వలన ఐతే..దోషములేదు. తిథి,వారముల వలన స్వల్ప దోషమును, తిథి,నక్షత్రముల వలన అర్ధదోషము,వార,నక్షత్రముల వలన త్రిపాద దోషము, తిథి,వార,నక్షత్రముల వలన సంపూర్ణ దోషమును కలుగును. "స్వగృహమున స్వంత తల్లిదండ్రులు దోషభూయిష్టమైన నక్షత్రములో మరణించిననూ దోషము లేదని కొందరు మహర్షులు చెప్పిరి.

## బోరింగులు - నూతులు లేక బావులు

తాను నివశించే గృహమునకు లేక స్థలమునకు 'కూపము' ఈశాన్య దిశలోనున్న ఐశ్వర్యప్రదము-సుఖము,తూర్పున అభివృద్ధి,ఆగ్నేయ భాగమున పుత్రకళత్ర అరిష్టము, నైఋతిలో మరణప్రదము-తనకేనష్టము, పడమర దిశలో సంపత్తును,రోగమును కలిగించును. వాయువ్యమున శత్రుత్వము, ఉత్తరమున సుఖము-సంపదగాన...గృహ మధ్య భాగములో నూయి,బోరింగ్‌లు వగైరా పనికిరావు, ముఖ్యముగా దక్షిణ,ఆగ్నేయ, నైఋతి, వాయువ్య దిశలు, గృహమధ్యమము అరిష్టములకు కారణమగును.

## బల్లి పడుట వలన కలుగు ఫలితములు

శిరస్సున కలహము, ముఖమునందు బంధుదర్శనము, పైపెదవి యందు ధనవ్యయము, క్రిందిపెదవియందు ధనలాభము, ముక్కు చివర రోగము, కుడిచెవిన దీర్ఘాయువు, ఎడమచెవిన వర్తక లాభము, నేత్రముల యందు ఖైదు, ముంగురులయందు శిక్ష, నుదుట నందు భయము, కంఠమున శత్రుహాని, కుడిభుజమున ఆరోగ్యము, ఎడమభుజమున స్త్రీ భోగము, కుడిమణికట్టునందు కీర్తి, స్తనములయందు దోషము, కడుపు మీద ధాన్యలాభము, వక్షము లేదా నాభియందు ధనలాభము, పార్శ్వముల యందు లాభము, తొడలు లేదా జానువుల యందు పిత్రారిష్టము, ప్రక్కల యందు సుఖము, కాళ్ళయందు ధనవ్యయము, లింగమున దరిద్రము, జుట్టుచివర మృత్యుభయము, తలమీదనుండి క్రిందకు దిగిన హాని, క్రింది నుండి పైకి ప్రాకిననూ లేదా ప్రాకినవెంటనే క్రిందకుదిగిననూ మేలు.

శరీరముపై బల్లి పడినవెంటనే శిరఃస్నానముచేసి, దీపము పెట్టి దోషనివా రణకై ఇష్ట దైవమును ప్రార్థించవలెను. తొండ ప్రాకిననూ ఇదేఫలము!

**గమనిక :** బల్లిపడుట దాని పర్యవసానము వర్తమానమున శాస్త్రీయమైన ఫలితములు ఇచ్చుటలేదు. అశేషమైన పంచాంగప్రియుల కోరికమేరకు పైఫలితములను వ్రాయడము జరిగినది. మానవుల సుఖదుఃఖములకు గ్రహములు ఇచ్చు శుభాశుభఫలితములే కీలకమైనవి. వాటిని అనుసరించి, జాగ్రత్తపడుటయే శ్రేయోదాయకము. గ్రహించగలరు!

# నవగ్రహముల సమయములు

ప్రతి జాతక చక్రమునుకు సమయావస్థలను అన్ని గ్రహములకు కట్టవలయును. ఏ గ్రహము,ఏ సమయావస్థను పొందియుండునో,ఆ గ్రహ మాస్వభావమును పొందియుండును. ఏ గ్రహమునకు సమయము కట్టవల యునో ఆ గ్రహము మేషాదిగా ఎన్నవరాశినందున్నదో తెలుసుకుని,ఆ రాశి సంఖ్యను మేషాది జన్మలగ్న సంఖ్యచే గుణించగా వచ్చిన మొత్తమును, ఏ గ్రహమునకు సమయము కట్టుచున్నామో ఆ గ్రహదశా ప్రమాణ సంఖ్యల చే తిరిగి గుణించగా వచ్చిన మొత్తమును 27చే భాగించవలయును. అట్లు భాగించగా లబ్దమును విడిచి శేషమును గ్రహించగా శేషసంఖ్యకు సరియగు సమయావస్థను ఆ గ్రహము యొక్క సమయముగా తెలుసుకోవలెను.

| శేష సంఖ్య | సమయము | సమయఫలము |
|---|---|---|
| 1 | స్నానసమయము | ధైర్యోత్సాహములు కలుగచేయును. |
| 2 | వస్త్రధారణ | అధికారమునిచ్చును. |
| 3 | తిలకధారణ | క్షేమము కలుగచేయును. |
| 4 | జపసమయము | శత్రుజయము |
| 5 | శివపూజ | శత్రుజయము,సౌఖ్యము |
| 6 | ఉపాసన | దుఃఖప్రాప్తి |
| 7 | విష్ణుపూజ | దిగ్విజయము |
| 8 | బ్రాహ్మణపూజ | రాజ్యప్రాప్తి |
| 9 | నమస్కారము | శుభప్రదము |
| 10 | అద్రిప్రదక్షిణ | లాభము |
| 11 | వైశ్యదేవసమయము | మంగళప్రదము |
| 12 | అతిథిపూజ | భోగభాగ్యము |
| 13 | భోజన | భోగము |
| 14 | విద్యాప్రసంగ | పాండిత్యము |
| 15 | ఆక్రోశ | వ్యసనము |
| 16 | తాంబూల | స్త్రీసౌఖ్యము |
| 17 | రాజవిలాసస్థితి | జయము |
| 18 | కిరీటధారణ | వాహనసౌఖ్యము,సుఖము |
| 19 | జలపాన | సుఖము |
| 20 | ఆలస్య | మిక్కిలిదుఃఖము |
| 21 | శయన | సౌభాగ్యవిహీనము |
| 22 | అమృతాసన | తృప్తినికలుగచేయును |
| 23 | గంధపుష్పాద్యాభరణ | ప్రభుత్వము |
| 24 | స్త్రీసల్లాప | భోగము |
| 25 | భోగ | కుటుంబవృద్ధి |
| 26 | నిద్రాసమయ | భోగవిహీనము |
| 27 | రత్నపరీక్షాసమయము | ధనప్రాప్తి |





# వివాహాది సుముహూర్తములు 2021-22

**గమనిక :** శాస్త్రమును, సంప్రదాయమును, అనుభవమును, దృష్టిలో ఉంచుకొని ఈ ముహూర్తములను నిర్ణయించుట జరిగినది. రాహుకాలమును, హోరాకాలమును ముహూర్తములందు పరిగణించరాదు. ముహూర్త నిర్ణయములో ఏకవింశతి దోషములను, వర్జ్య దుర్ముహూర్తములను మాత్రమే పరిగణించి సరిపడు తిథి, వార, నక్షత్ర, లగ్నములను రహిత పరచి, వివిధ చక్రశుద్ధులను గావించి ఆయా ముహూర్తములుంచుట మంచిది.

పాపగ్రహముల క్రాంతము మరియు వేధలు గల నక్షత్రాలు తీవ్ర దుష్పరిణామా లు కలిగించుట మా అనుభవనీయము. కావున ఎంతటి లగ్నబలము, గ్రహబలము కలిగి యున్ననూ అటువంటి నక్షత్రములలో శుభ ముహూర్తములను విసర్జించాలి.

వివాహమునకు జామిత్రశుద్ధి, సర్వ ముహూర్తములకు అష్టమశుద్ధి చూడడము జరిగినది. చరలగ్న ములు,సోమవారము వివాహ ముహూర్తములలో నిషేధించుట జరిగినది. భృగుషట్కమును వదిలి వేయడము జరిగినది. పంచకరహితము చేయుటలో సూర్యోదయాత్ సూర్యోదయ పర్యంతము ఒకేదిన(వార)ముగా లెక్కించడమైనది. పంచకరహితములో భిన్నమైన పద్ధతులు ఉన్నవి. పంచకరహితము కంటే లగ్నబలము కు ప్రాధాన్యత ఇవ్వాలి. రాహు-కేతువులను కూడా గ్రహములగానే పరిగణించాలి.

చక్రశుద్ధులు (వివాహ-వృషభ-కలశ) లేని నక్షత్రములతో కూడిన మరియు స్థానశుద్ధి లేని లగ్నములతో కూడిన బలమైన ముహూర్తములను ద్వితీయ పక్షముగా గ్రహించవచ్చు.

ఒక వ్యక్తికి ముహూర్తమును నిర్ణయించేటప్పుడు...ముందుగా ఆ వ్యక్తి యొక్క జన్మ లేదా నామ నక్షత్రము నుండి ముహూర్త నక్షత్రము వరకు తారాబలమును లెక్కించవలెను. అనగా **2-11-20** సంపత్, **4-13-22** క్షేమ, **6-15-24** సాధన, **8-17-26** మిత్ర, **9-18-27** పరమమైత్ర తారలును మాత్రమే గ్రహించవలెను. అటులనే ఆ వ్యక్తి జన్మరాశి లేదా నామరాశి నుండి **4-8-12** రాశులలో చంద్రుడున్న ముహూర్త నక్షత్రములను త్యజించవలెను. ఎంతటి తారాబలము-గ్రహబలము ఉన్ననూ ఎట్టి పరిస్థితులలోను ముహూర్తలగ్నము, ఆ వ్యక్తి యొక్క జన్మలగ్నము నుండి **6-8-12** లగ్నములలో పడరాదు.

అన్ని ముహూర్తములకు అష్టమశుద్ధి ఉండాలి. ముహూర్త లగ్నము పాపార్గళములో గాని, పాపగ్రహ కర్తరిలో గాని పడరాదు. ముహూర్తము నాడు చంద్రుడు పాప గ్రహములతో కలవరాదు. చంద్రుడు లగ్నములో ఉండగా ఎటువంటి శుభకార్యము చేయరాదు. గృహారంభ మరియు ప్రవేశ లగ్నములకు **4-12** స్థానములలో ఎటువంటి పాప గ్రహము లు ఉండరాదు. వివాహ ముహూర్తలగ్నము నుండి **7** డింట ఏ గ్రహము లు ఉండరాదు. వివాహ లగ్నమునకు **7**వ ఇంట సూర్యుడు-కుజుడు-రాహు-కేతువులు ఉండిన యెడల, ఆత్మహత్యలు-కోర్టు గొడవలు-వివాదములు-ఆకస్మిక మరణములు వచ్చును. వివాహ లగ్నమునకు **7**వ ఇంట చంద్రుడున్నప్పుడు, భార్యాభర్తలు అనుమాన ము- అపనిందలతో త్వరగా విడిపోవును. వివాహ లగ్నమునకు **7**వ ఇంట బుధ-శనులు ఉన్నప్పుడు షండత్వము లేదా సంతాన హీనత కలుగును. వివాహ లగ్నమునకు **7**వ ఇంట గురుడు ఉన్నప్పుడు, అవమానములు-కలహములు కలుగును. వివాహ లగ్నము నకు **7**వ ఇంట శుక్రుడు ఉన్నప్పుడు, జారత్వము లేదా చెడు ప్రవర్తన కలుగును. కావున పండితులు పొరపాటుగా లగ్నమును నిర్ణయించిననూ విజ్ఞులు గ్రహించగలరు.

ఈ ముహూర్తములు రాజమండ్రికి చేయబడి, ఇండియన్ స్టాండర్డ్ టైమ్‌కు సరిచూపబడినవి. కావున...ఈ పంచాంగము లోని దేశాంతర సంస్కార చక్రము ఉపయోగించి ఆంధ్రదేశమంతటా ఆచరించవచ్చు.

ఆయా శుభకార్యములకు ఆయా స్థానశుద్ధులను తప్పక పాటించవలెను.



## 1. చైత్ర మాసము (13-04-2021 నుండి 11-05-2021 వరకు)

| | | | |
|---|---|---|---|
| రవి బుధ | శుక్ర చంద్ర | రాహు కుజ | |
| గురు | చైత్ర మాస ప్రారంభ గ్రహస్థితులు | | |
| శని | | | |
| | కేతు | | |

**13-04-2021 మేష రవి**
**13-04-2021 మిధున కుజ**
**16-04-2021 మేష బుధ**
**01-05-2021 వృషభ బుధ**
**02-05-2021 శుక్రమూఢమి ఆఖరు**
**04-05-2021 వృషభ శుక్ర**
**04-05-2021 డొల్లుకర్తరి మొదలు**
**11-05-2021 నిజకర్తరి మొదలు**

**గమనిక : మే నెల 2వ తేదివరకు శుక్రమూఢమి ఉండుటవలన, అప్పటివరకు ఎటువంటి శుభముహూర్తములు లేవు. ఉదయలగ్నములు శుద్ధిలేనందున అన్నప్రాశన ముహూర్తములు లేవు.**

ఏప్రిల్ 13. మంగళ చైత్ర శుక్ల విదియ భరణి క్రయవిక్రయాదులు సింహ రః పః3-34. కుంభ రః తెః3-57.

14. బుధ తదియ భరణి క్రయవిక్రయాదులు సింహ రః పః3-29. కృత్తిక(శనివేధ) సాధారణ పనులు కుంభ రః తెః3-52. మీన రాజః తెః4-35.

15. గురు చవితి రోహిణి (రాహుక్రాంతము) సాధారణపనులు కుంభ శ్చోరః రా.3-49. మీన రః తెః4-32.

16. శుక్ర పంచమి మృగశిర (కుజక్రాంతము) సాధారణపనులు కుంభం రః రాః3-45.

17. శని పంచమి మృగశిర (కుజక్రాంతము) సాధారణపనులు సింహ మతాంః రః పః3-18. షష్ఠి ఆరుద్ర కుంభం రః రాః3-41. మీన రాజః తెః4-24.

18. ఆది షష్ఠి ఆరుద్ర క్రయవిక్రయాదులు సింహ రః పః3-14. సప్తమి ఆరుద్ర సాధారణపనులు కుంభం రః రాః3-37. మీనం వసుః తెః4-20.

19. సోమ అష్టమి పునర్వసు సాధారణపనులు మీన తెః4-15.

20. మంగళ అష్టమి పుష్యమి (కేతువేధ) క్రయవిక్రయాదులు సింహ మతాంః రః పః3-05. (12చంద్రః) నవమీ పుష్యమి సాధారణ పనులు కుంభ రాజః రాః3-28. (6చంద్రః) మీన రః తెః4-11.

21. బుధ నవమీ ఆశ్లేష క్రయవిక్రయాదులు సింహ రః పః3-01. (12చంద్రః) దశమీ ఆశ్లేష సాధారణపనులు కుంభ రః రాః3-24. (6చంద్రః) మీన తెః4-07.



ఒక వ్యక్తియొక్క ఆగామికర్మను అనుసరించి మూహూర్తము దొరుకును.



22. గురు ఏకాదశి మఖ (శనివేధ) సాధారణపనులు మీనం తెః4-04. (6చంద్రః)

23. శుక్ర ఏకాదశి పుబ్బ (రవివేధ) సాధారణపనులు సింహశ్చోరః పః2-53. (1చంద్రః) ద్వాదశి పుబ్బ కుంభ రాజః రాః3-16. (7చంద్రః) మీన రః తెః3-59. (6చంద్రః)

24. శని ద్వాదశి ఉత్తర క్రయవిక్రయాదులు సింహ రః పః2-49. త్రయోదశి ఉత్తర సాధారణపనులు కుంభ రః రాః3-12. (8చంద్రః) మీన తెః3-55. (7చంద్రః)

25. ఆది త్రయోదశి హస్త క్రయవిక్రయాదులు సింహ రః పః2-45. చతుర్దశి చిత్త సాధారణపనులు కుంభం రాజః రా.3-08. మీన రః రాః3-51. (8చంద్రః)

26. సోమ పూర్ణిమా చిత్త క్రయవిక్రయాదులు సింహ రః పః2-41. స్వాతి సాధారణపనులు కుంభ రః రాః3-01.

27. మంగళ బః పాడ్యమి స్వాతి క్రయవిక్రయాదులు సింహశ్చోరః పః2-38. విశాఖ సాధారణపనులు కుంభ రాజః రాః3-01.

28. బుధ విదియ విశాఖ క్రయవిక్రయాదులు సింహ రః పః2-33. తదియా అనురాధ (రవివేధ) సాధారణపనులు కుంభ మతాంః రః రాః2-56. మీన రః రాః3-39.

29. గురు తదియా అనురాధ క్రయవిక్రయాదులు సింహ రః పః2-29. చవితి జ్యేష్ఠ (కేతుక్రాంతము) సాధారణపనులు మీన రః రాః3-35.

30. శుక్ర చవితి మూల సాధారణపనులు సింహ రః పః2-25. పంచమి మూల కుంభ రః రాః2-48. మీన రాః3-31.

మే 1. శని షష్ఠి పూర్వాషాఢ (కుజవేధ) సాధారణపనులు కుంభం మతాంః రః రాః2-44. మీన రః రాః3-27.

2. ఆది షష్ఠి ఉత్తరాషాఢ క్రయవిక్రయాదులు సింహశ్చోరః పః2-18. (6చంద్రః) సప్తమీ ఉత్తరాషాఢ వివాహ-గృహారంభ-ప్రవేశాదులు కుంభ రాజః రాః2-41. (12చంద్రః) మీన రః రాః3-24. (వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)

3. సోమ అష్టమి శ్రవణము (శనిక్రాంతము) సాధారణపనులు కుంభ రః రాః2-36. (12చంద్రః) మీన రాః3-19.

5. బుధ దశమీ శతభిషము క్రయవిక్రయాదులు సింహ రః పః2-06. (7చంద్రః) సాధారణపనులు కుంభ రాజః రాః2-29. (1చంద్రః) వివాహ-గృహారంభ-ప్రవేశాదులు మీన రః రాః3-12. (12చంద్రః)

## 2. వైశాఖ మాసము (12-05-2021 నుండి 10-06-2021 వరకు)

| | | | |
|---|---|---|---|
| | రవి చంద్ర | బుధ రాహు శుక్ర | కుజ |
| గురు | వైశాఖ మాస ప్రారంభ గ్రహస్థితులు | | |
| శని | | | |
| | కేతు | | |

**14-05-2021 వృషభ రవి**
**23-05-2021 శని వక్రారంభము**
**26-05-2021 మిధున బుధ**
**28-05-2021 కర్తరి ఆఖరు**
**28-05-2021 మిధున శుక్ర**
**29-05-2021 బుధ వక్రం మొదలు**
**02-06-2021 వృషభ వక్రీబుధ**
**02-06-2021 కర్కాటక కుజ**

**గమనిక : ది.28-05-2021 వరకు కర్తరి ఉండుట వలన గృహారంభ ముహూర్తములు ఉండవు.**

మే

13. గురు వైశాఖ శుక్ల విదియ రోహిణి (రాహుక్రాంతము) సాధారణ పనులు సింహ ర॥ ప॥1-35. కుంభ మతాం॥ ర॥ రా॥1-58. మీన ర॥ రా॥2-41.

14. శుక్ర తదియ మృగశిర వివాహ-గృహప్రవేశాదులు కుంభ ర॥ రా॥1-53. మీన మతాం॥ ర॥ రా॥2-36. (చక్రశుద్ధులు లేవు)

15. శని చవితి ఆరుద్ర (కుజక్రాంతము) సాధారణపనులు సింహ ర॥ ప॥1-25. కన్యా ర॥ ప॥3-04. మేష ర॥ తె॥5-01. (8కేతుః)

16. ఆది పంచమి పునర్వసు క్రయవిక్రయాదులు సింహ ర॥ ప॥1-22. వివాహ-గృహప్రవేశాదులు మీన ర॥ రా॥2-28. పునర్వసు (కుజక్రాంతము) సాధారణపనులు మేష ర॥ తె॥4-56. (8కేతుః) (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)

17. సోమ షష్ఠి పుష్యమి (కేతువేధ) గృహప్రవేశాదులు కుంభ ర॥ రా॥1-42. (6చంద్రః) మేష వసుః తె॥4-53. (8కేతుః) (వృషభ చక్రశుద్ధి లేదు)

18. మంగళ సప్తమి పుష్యమి (కేతువేధ) క్రయవిక్రయాదులు సింహ ర॥ ప॥1-15. (12చంద్రః) కన్యా మతాం॥ ర॥ ప॥2-52. ఆశ్లేష సాధారణపనులు కుంభ ర॥ రా॥1-38. (6చంద్రః) మీన రాజః రా॥2-21.

19. బుధ అష్టమి ఆశ్లేష సాధారణపనులు సింహ మతాం॥ ర॥ ప॥1-10. (12చంద్రః) కన్యా ర॥ ప॥2-47. మఖ (శనివేధ) గృహప్రవేశాదులు కుంభ మతాం॥ ర॥ రా॥1-33. (7చంద్రః) వివాహ-గృహప్రవేశాదులు మీన ర॥ రా॥2-16. (6చంద్రః) (వివాహ చక్రశుద్ధి లేదు)





20. గురు నవమి మఖ (శనివేధ) క్రయవిక్రయాదులు కన్యా ర॥ ప॥2-43. (12చంద్రః) పుబ్బ సాధారణపనులు మేష మతాం॥ ర॥ తె॥4-40. (8కేతుః)

21. శుక్ర దశమి పుబ్బ సాధారణపనులు కన్యా చోరః ప॥2-39. ఉత్తర గృహప్రవేశాదులు మీన రాజః రా॥2-08. (7చంద్రః) మేష తె॥4-36. (6చంద్రః,8కేతుః)

22. శని ఏకాదశి ఉత్తర క్రయవిక్రయాదులు సింహ వసుః ప॥12-58. హస్త గృహప్రవేశాదులు మీన ర॥ రా॥2-04. (7చంద్రః) మేష ర॥ తె॥4-32. (6చంద్రః,8కేతుః)

23. ఆది ద్వాదశి చిత్త క్రయవిక్రయాదులు సింహ ర॥ ప॥12-54. కన్యా చోరః ప॥2-31. (1చంద్రః)

24. సోమ త్రయోదశి స్వాతి క్రయవిక్రయాదులు కన్యా ర॥ ప॥2-27. చతుర్దశి స్వాతి గృహప్రవేశాదులు కుంభ చోరః రా॥1-13. మేష ర॥ తె॥4-24. (7చంద్రః,8కేతుః) (వృషభ చక్రశుద్ధి లేదు)

25. మంగళ చతుర్దశి విశాఖ క్రయవిక్రయాదులు కన్యా ర॥ ప॥2-24. పూర్ణిమా విశాఖ సాధారణపనులు కుంభ ర॥ రా॥1-10. మేష తె॥4-21. (8కేతుః)

26. బుధ పూర్ణిమ అనురాధ క్రయవిక్రయాదులు సింహ ర॥ ప॥12-43. కన్యాశ్చోరః ప॥2-20. బ॥పాడ్యమి అనురాధ వివాహ-గృహప్రవేశాదులు కుంభశ్చోరః రా॥1-06. జ్యేష్ఠ (కేతుక్రాంతము) సాధారణపనులు మీన మతాం॥ ర॥ రా॥1-49. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)

27. గురు బ॥విదియ జ్యేష్ఠ (కేతుక్రాంతము) క్రయవిక్రయాదులు కన్యా మతాం॥ ర॥ ప॥2-16. మూల (కుజవేధ) సాధారణ పనులు మేష ర॥ తె॥4-13. (8కేతుః)

28. శుక్ర తదియ మూల (కుజవేధ) క్రయవిక్రయాదులు కన్యా ర॥ ప॥2-11. పూర్వాషాఢ సాధారణపనులు కుంభ రాజః రా॥12-57. మీన ర॥ రా॥1-40. మేష ర॥ తె॥4-08. (8కేతుః)

29. శని చవితి పూర్వాషాఢ క్రయవిక్రయాదులు సింహ ర॥ ప॥12-30. ఉత్తరాషాఢ వివాహ-గృహప్రవేశాదులు కుంభ ర॥ రా॥12-53. (12చంద్రః) మీన వసుః రా॥1-36. గృహారంభ-

ప్రవేశాదులు మేష మతాం॥ ర॥ తె॥4-04. (8కేతుః) (వివాహ-కలశ చక్రశుద్ధులు లేవు)

30. ఆది పంచమి ఉత్తరాషాఢ క్రయవిక్రయాదులు సింహ ర॥ ప॥12-26. (6చంద్రః) కన్యాశ్శ్రీరః ప॥2-03. శ్రవణము (శనిక్రాంతము) సాధారణపనులు కుంభ ర॥ రా॥12-49. (12చంద్రః) మీన మతాం॥ ర॥ రా॥1-32. షష్ఠి శ్రవణము (శనిక్రాంతము) మేష ర॥ తె॥4-00. (8కేతుః)

31. సోమ షష్ఠి శ్రవణము (శనిక్రాంతము) సాధారణపనులు సింహ వసుః ప॥12-19. (6చంద్రః) కన్యా ర॥ ప॥1-59. ధనిష్ఠ గృహ ప్రవేశాదులు కుంభ మతాం॥ ర॥ రా॥12-45. (12చంద్రః) సప్తమీ ధనిష్ఠ మీన మతాం॥ ర॥ రా॥1-28. గృహారంభ-ప్రవేశాదులు మేష తె॥3-56. (8కేతుః) (కలశ చక్రశుద్ధి లేదు)

జూన్ 1. మంగళ సప్తమి ధనిష్ఠ క్రయవిక్రయాదులు కన్యా ర॥ ప॥1-56. (6చంద్రః) శతభిషము సాధారణపనులు కుంభ ర॥ రా॥12-42. (1చంద్రః) అష్టమీ శతభిషము మేష ర॥ తె॥3-53. (8కేతుః)

2. బుధ అష్టమీ శతభిషము క్రయవిక్రయాదులు కన్యాశ్శ్రీరః ప॥1-53. (6చంద్రః) నవమీ పూర్వాభాద్ర సాధారణపనులు మేష ర॥ తె॥3-50. (8కేతుః)

3. గురు నవమీ పూర్వాభాద్ర క్రయవిక్రయాదులు సింహ వసుః ప॥12-12. (7చంద్రః) కన్యా ర॥ ప॥1-49. (6చంద్రః) ఉత్తరాభాద్ర వివాహ-గృహప్రవేశాదులు కుంభశ్శ్రీరః రా॥12-35. సాధారణపనులు మీన ర॥ రా॥1-18. (1చంద్రః) దశమీ ఉత్తరాభాద్ర గృహారంభ-ప్రవేశాదులు మేష తె॥3-46. (8కేతుః, 12చంద్రః)

4. శుక్ర దశమి ఉత్తరాభాద్ర క్రయవిక్రయాదులు కన్యా ర॥ ప॥1-44. (7చంద్రః) రేవతి వివాహ-గృహప్రవేశాదులు కుంభ ర॥ రా॥12-30. గృహారంభ-ప్రవేశాదులు మేష తె॥3-41. (8కేతుః,12చంద్రః)

5. శని ఏకాదశి రేవతి క్రయవిక్రయాదులు కన్యాశ్శ్రీరః ప॥1-40. (7చంద్రః) అశ్విని వివాహ-గృహప్రవేశాదులు కుంభ ర॥ రా॥12-26. మీన రాజః రా॥1-09. (12చంద్రః) సాధారణ పనులు మేష తె॥3-37. (1చంద్రః,8కేతుః)







## 3. జ్యేష్ఠ మాసము (11-06-2021 నుండి 10-07-2021 వరకు)

| | | | |
|---|---|---|---|
| | | రవి బుధ(వ) రాహు | చంద్ర శుక్ర |
| గురు | జ్యేష్ఠ మాస ప్రారంభ గ్రహస్థితులు | | కుజ |
| శని(వ) | | | |
| | కేతు | | |

15-06-2021 మిధున రవి
20-06-2021 గురు వక్రారంభము
22-06-2021 బుధ వక్రం ఆఖరు
22-06-2021 కర్కాటక శుక్ర
07-07-2021 మిధున బుధ

జూన్ 11. శుక్ర జ్యేష్ఠ శు॥విదియ ఆరుద్ర సాధారణపనులు మేష తె॥3-14. (8కేతుః)

12. శని విదియ ఆరుద్ర క్రయవిక్రయాదులు కన్యా ర॥ ప॥1-13.

13. ఆది తదియ పునర్వసు అన్నప్రాశన-అక్షరస్వీకార-ఉపనయన-గృహారంభ-ప్రవేశాదులు సింహ ర॥ ఉ॥11-33.(7గురుః) క్రయవిక్రయాదులు కన్యా వసుః ప॥1-10. చవితి పుష్యమి (కుజక్రాంతము) సాధరణపనులు కుంభశ్శ్రీరః రా॥11-56. (6చంద్రః) మీన ర॥ రా॥12-39. మేష ర॥ రా॥3-07. (8కేతుః) చక్రశుద్ధులు లేవు)

14. సోమ పంచమి ఆశ్లేష (కేతువేధ) సాధారణపనులు కుంభ ర॥ రా॥11-52. (6చంద్రః) మేష తె॥3-03. (8కేతుః)

15. మంగళ పంచమీ ఆశ్లేష (కేతువేధ) సాధారణపనులు కన్యా ర॥ ప॥1-02. షష్ఠీ మఖ (శనివేధ) మేష తె॥2-59. (8కేతుః)

16. బుధ షష్ఠి మఖ (శనివేధ) సాధారణపనులు కన్యా వసుః ప॥12-58. (12చంద్రః) తులా ర॥ ప॥3-49. (8రాహుః) సప్తమీ పుబ్బ కుంభశ్శ్రీరః రా॥11-44. (7చంద్రః) మీన ర॥ రా॥12-27. (6చంద్రః) మేష ర॥ రా॥2-55. (8కేతుః)

17. గురు అష్టమి ఉత్తర గృహప్రవేశాదులు కుంభ ర॥ రా॥11-40. (7చంద్రః) గృహారంభ-ప్రవేశాదులు మేష తె॥2-51. (8కేతుః)

18. శుక్ర అష్టమి ఉత్తర అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకారము వివాహ-గృహారంభ-ప్రవేశాదులు సింహ మతాం॥ ర॥ ఉ॥11-13. క్రయవిక్రయాదులు తులా మతాం॥ ర॥ ప॥3-41. (8రాహుః,12చంద్రః) నవమీ హస్త సాధారణపనులు కుంభ ర॥ రా॥11-36. (8చంద్రః) గృహప్రవేశాదులు మీన రాజః రా॥12-19. (7చంద్రః) మేష రా॥2-47. (6చంద్రః,8కేతుః) (వివాహ చక్రశుద్ధి లేదు)

19. శని నవమీ హస్త అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-

వ్యాపార-వివాహ-గృహారంభ-ప్రవేశాదులు సింహ ర॥ ఉ॥ 11-09. క్రయవిక్రయాదులు కన్యా మతాం॥ ర॥ ప॥12-46. (1చంద్రః) తులా ర॥ ప॥3-37. (8రాహుః, 12చంద్రః) దశమీ చిత్త సాధారణపనులు కుంభశ్చ్రోరః రా॥11- 32. (8చంద్రః) గృహప్రవేశాదులు మీన ర॥ రా॥12-15. (7చంద్రః) మేష ర॥ రా॥2-43. (6చంద్రః,8కేతుః) (వివాహ చక్రశుద్ధి లేదు)

20. ఆది దశమి చిత్త అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-వ్యాపార-వివాహ-గృహారంభ-ప్రవేశాదులు సింహ ర॥ ఉ॥11-05. క్రయవిక్రయాదులు కన్యా రాజః ప॥12-42. తులా ర॥ ప॥3-33. (1చంద్రః,8రాహుః) (వివాహ చక్రశుద్ధి లేదు)

21. సోమ ఏకాదశి స్వాతి అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-గృహారంభ-ప్రవేశ వ్యాపారాదులు సింహాశ్చ్రోరః ఉ॥11-00. ద్వాదశి విశాఖ సాధారణపనులు మేష రా॥2-34. (7చంద్రః, 8కేతుః)

22. మంగళ త్రయోదశి అనురాధ (కేతుక్రాంతము) సాధారణ పనులు తులా రాజః ప॥3-25. (8రాహుః) కుంభ మతాం॥ ర॥ రా॥11-20. మేష ర॥ రా॥2-31. (8చంద్రః,కేతుః)

23. బుధ చతుర్దశి అనురాధ (కేతుక్రాంతము) అన్నప్రాశనాదులు సింహ మతాం॥ ర॥ ఉ॥10-53. జ్యేష్ఠ (కుజవేధ) క్రయవిక్రయాదులు కన్యాశ్చ్రోరః ప॥12-30. తులా ర॥ ప॥3-21. (8రాహుః) సాధారణపనులు మీన ర॥ రా॥11-59.

24. గురు పూర్ణిమ మూల అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-వ్యాపార-వివాహ-గృహారంభ-ప్రవేశాదులు సింహ వసుః ఉ॥ 10-49. క్రయవిక్రయాదులు కన్యా ర॥ ప॥12-26. వివాహ-గృహప్రవేశాదులు కుంభ ర॥ రా॥11-12. మీనశ్చ్రోరః రా॥11-55. బ॥పాడ్యమి మూల గృహప్రవేశాదులు మేషం రా॥2-23. (8కేతుః) (వృషభ-కలశ చక్రశుద్ధులు లేవు)

25. శుక్ర బ॥పాడ్యమి పూర్వాషాఢ (రవివేధ) అన్నప్రాశనాదులు సింహ ర॥ ఉ॥10-45. క్రయవిక్రయాదులు కన్యా మతాం॥ ర॥ ప॥12-22. తులా ర॥ ప॥3-13. (8రాహుః) విదియ పూర్వాషాఢ (రవివేధ) సాధారణపనులు కుంభ ర॥ రా॥11-08. మీన రాజః రా॥11-51. మేషం రా॥2-19. (8కేతుః)

26. శని విదియ ఉత్తరాషాఢ అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార వివాహ-వ్యాపార-గృహారంభ-ప్రవేశాదులు సింహ వసుః ఉ॥ 10-41. (6చంద్రః) తదియ ఉత్తరాషాఢ వివాహ-గృహప్రవేశాదులు కుంభశ్చ్రోరః రా॥11-04. (12చంద్రః) మీన ర॥ రా॥ 11-47. గృహారంభ-ప్రవేశాదులు మేష రా॥2-15. (8కేతుః)





(వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)

27. ఆది తదియ శ్రవణము (శనిక్రాంతము) సాధారణపనులు సింహ మతాం॥ ర॥ ఉ॥10-37. (6చంద్రః) కన్యా ర॥ ప॥12-14. తులా మతాం॥ ర॥ ప॥3-05. (8రాహుః) చవితి శ్రవణము (శనిక్రాంతము) మీన ర॥ రా॥11-43. చవితి ధనిష్ఠ గృహప్రవేశాదులు మేష రా॥ 2-11, (8కేతుః) (కలశ చక్రశుద్ధి లేదు)

28. సోమ చవితి ధనిష్ఠ అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-వ్యాపార గృహారంభ-ప్రవేశాదులు సింహ ర॥ ఉ॥10-34. (6చంద్రః) క్రయవిక్రయాదులు కన్యా మతాం॥ ర॥ ప॥12-11. పంచమీ ధనిష్ఠ సాధరాణపనులు కుంభ ర॥ రా॥10-57. (1చంద్రః) గృహప్రవేశాదులు మీనం మతాం॥ ర॥ రా॥11-40. (12చంద్రః) గృహప్రవేశాదులు మేషం రా॥2-08. (8కేతుః) (కలశ చక్రశుద్ధి లేదు)

29. మంగళ షష్ఠి శతభిషము క్రయవిక్రయాదులు తులా రాజః ప॥2-58. (8రాహుః) సాధారణపనులు కుంభం మతాం॥ ర॥ రా॥10-53. (1చంద్రః) మీన ర॥ రా॥11-36. (12చంద్రః)

30. బుధ షష్ఠి పూర్వాభాద్ర సాధారణపనులు సింహ రాజః ఉ॥ 10-26. (7చంద్రః) సప్తమి పూర్వాభాద్ర క్రయవిక్రయాదులు తులా ర॥ ప॥2-54. (8రాహుః) మీన ర॥ రా॥11-32. (1చంద్రః)

జూలై 1. గురు సప్తమి ఉత్తరాభాద్ర అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకారాదులు కన్యా మతాం॥ ర॥ ఉ॥11-59. (7చంద్రః) అష్టమీ ఉత్తరాభాద్ర వివాహ-గృహప్రవేశాదులు కుంభ ర॥ రా॥ 10-45. సాధారణపనులు మీనశ్చ్రోరః రా॥11-28. (1చంద్రః) గృహప్రవేశాదులు మేషం రా॥1-56. (8కేతుః) (వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)

2. శుక్ర అష్టమి రేవతి క్రయవిక్రయాదులు తులా ర॥ ప॥2-47. (6చంద్రః,8రాహుః) నవమీ రేవతి వివాహ-గృహప్రవేశాదులు కుంభ వసుః రా॥10-42. సాధారణపనులు మీన ర॥ రా॥11-25. (1చంద్రః) గృహప్రవేశాదులు మేష ర॥ రా॥1-53. (8కేతుః, 12చంద్రః)

3. శని నవమి అశ్విని అన్నప్రాశన-ఉపనయన-అక్షరస్వీకార-వివాహ-వ్యాపార-గృహారంభ-ప్రవేశాదీనాం సింహ రాజః ఉ॥ 10-16. సాధరాణపనులు కన్యా ర॥ ఉ॥11-53. (8చంద్రః) క్రయవిక్రయాదులు తులాశ్చ్రోరః ప॥2-44. (7చంద్రః, 8రాహుః) దశమీ అశ్విని వివాహ-గృహప్రవేశాదులు మీనం ర॥ రా॥11-22.

4. ఆది దశమి భరణి (కేతువేధ) సాధారణపనులు సింహ ర॥ ఉ॥10-12. ఏకాదశి భరణి కుంభ ర॥ రా॥10-35. మీన వసుః రా॥11-18.

## 4. ఆషాఢ మాసము (11-07-2021 నుండి 8-08-2021 వరకు)

| | | | |
|---|---|---|---|
| | | రాహు | రవి బుధ |
| గురు(వ) | ఆషాఢ మాస ప్రారంభ గ్రహస్థితులు | | చంద్ర కుజ శుక్ర |
| శని (వ) | | | |
| | కేతు | | |

**16-07-2021 కర్కాటక రవి**
**17-07-2021 సింహ శుక్ర**
**20-07-2021 సింహ కుజ**
**25-07-2021 కర్కాటక బుధ**
**08-08-2021 సింహ బుధ**

జూలై 11. ఆది ఆషాఢ శుక్ల విదియా పుష్యమి క్రయవిక్రయాదులు తులా ర॥ ప॥2-12. (8రాహుః) సాధారణపనులు కుంభ మతాం॥ ర॥ రా॥10-07. (6చంద్రః) మీన ర॥ రా॥10-50. మేషం ర॥ రా॥1-18. (8కేతుః)

12. సోమ తదియ ఆశ్లేష (కుజక్రాంతము,కేతువేధ) సాధారణ పనులు తులా ర॥ ప॥2-08. (8రాహుః) కుంభ ర॥ రా॥10-03. (6చంద్రః) మీన మతాం॥ ర॥ రా॥10-46. మేష మతాం॥ ర॥ రా॥1-14. (8కేతుః)

13. మంగళ చవితి మఖ (శనివేధ) సాధారణపనులు సింహ రాజః ఉ॥9-35. (1చంద్రః) కన్యా ర॥ ఉ॥11-12. (12చంద్రః) తులా వసుః ప॥2-03. (8రాహుః) మేష ర॥ రా॥2-09. (8కేతుః)

14. బుధ పంచమి పుబ్బ సాధారణపనులు సింహ ర॥ ఉ॥9-32. (1చంద్రః) అన్నప్రాశనాదులు కన్యా వసుః ఉ॥11-09. (12చంద్రః) క్రయవిక్రయాదులు తులా ర॥ ప॥2-00. (8రాహుః) సాధారణపనులు కుంభ రాజః రా॥9-55. మీన ర॥ రా॥10-38. (6చంద్రః) మేష ర॥ రా॥1-06. (8కేతుః)

15. గురు షష్ఠి ఉత్తర క్రయవిక్రయాదులు తులా ర॥ ప॥1-56. (8రాహుః) సాధారణపనులు కుంభ ర॥ రా॥9-51. (8చంద్రః) మీన వసుః రా॥10-34. మేషశ్చోరః రా॥1-02. (6చంద్రః) (8కేతుః)

16. శుక్ర సప్తమి హస్త అన్నప్రాశనాదులు సింహ రాజః ఉ॥9-25. కన్యా ర॥ ఉ॥11-02. (1చంద్రః) క్రయవిక్రయాదులు తులా





శ్చోరః ప॥1-53. (12చంద్రః,8రాహుః) సాధారణపనులు మేష ర॥ రా॥12-59. (6చంద్రః,8కేతుః)

17. శని అష్టమి చిత్త సాధారణపనులు సింహ ర॥ ఉ॥9-20. తులా ర॥ ప॥1-48. (8రాహుః,12చంద్రః) కుంభ రాజః రా॥9-43. మేష ర॥ రా॥12-54. (7చంద్రః,8కేతుః)

18. ఆది నవమి స్వాతి అన్నప్రాశనాదులు సింహ ర॥ ఉ॥9-16. కన్యా మతాం॥ ర॥ ఉ॥10-53. క్రయవిక్రయాదులు తులా ర॥ ప॥1-44. (1చంద్రః,8రాహుః) సాధరణపనులు కుంభ ర॥ రా॥9-39.

19. సోమ దశమి విశాఖ సాధారణపనులు సింహ మతాం॥ ర॥ ఉ॥9-12. కన్యా ర॥ ఉ॥10-49. తులా వసుః ప॥1-40. (1చంద్రః,8రాహుః) కుంభ ర॥ రా॥9-35. ఏకాదశి విశాఖ మీన ర॥ రా॥10-18.

20. మంగళ ఏకాదశి అనురాధ (కేతుక్రాంతము,కుజవేధ) సాధారణపనులు సింహ ర॥ రా॥9-08. ద్వాదశి జ్యేష్ఠ (రవివేధ) కుంభ వసుః రా॥9-31. మీన ర॥ రా॥10-14.

21. బుధ ద్వాదశి జ్యేష్ఠ (రవివేధ) సాధారణపనులు సింహ ర॥ ఉ॥9-04. కన్యా రాజః ఉ॥10-41. తులా ర॥ ప॥1-32. (8రాహుః) త్రయోదశి మూల మీన ర॥ రా॥10-10.

22. గురు త్రయోదశి మూల అన్నప్రాశనాదులు సింహాశ్చోరః ఉ॥9-00. సాధారణపనులు తులా వసుః ప॥1-28. (8రాహుః) చతుర్దశి పూర్వాషాఢ కుంభ ర॥ రా॥9-23. మీన మతాం॥ ర॥ రా॥10-06. మేష మతాం॥ ర॥ రా॥12-34. (8కేతుః)

23. శుక్ర పూర్ణిమ ఉత్తరాషాఢ సాధారణపనులు కుంభ మతాం॥ ర॥ రా॥9-19. మేష ర॥ రా॥12-30. (8కేతుః)

24. శని బ॥పాడ్యమి ఉత్తరాషాఢ అన్నప్రాశనాదులు కన్యా మతాం॥ ర॥ ఉ॥10-29. శ్రవణము (శనిక్రాంతము,కుజవేధ) సాధారణ పనులు కుంభ ర॥ రా॥9-15. (12చంద్రః) మీన మతాం॥ ర॥ రా॥9-58. మేష మతాం॥ ర॥ రా॥12-26. (8కేతుః)

25. ఆది విదియ శ్రవణము (శనిక్రాంతము,కుజవేధ) సాధారణ

పనులు కన్యా రాజః ఉ॥10-25. ధనిష్ఠ క్రయవిక్రయాదులు తులాశ్చ్యేరః ప॥1-16. (8రాహుః) సాధారణపనులు మేష ర॥ రా॥12-22. (8కేతుః)

26. సోమ తదియ ధనిష్ఠ అన్నప్రాశనాదులు కన్యా ర॥ ఉ॥10-22. (6చంద్రః) శతభిషము సాధారణపనులు కుంభ రాజః రా॥9-08. (1చంద్రః) మీన రాజః ఉ॥9-51. (12చంద్రః) మేష ర॥ రా॥12-19. (8కేతుః)

27. మంగళ చవితి పూర్వాభాద్ర సాధారణపనులు తులా ర॥ ప॥1-08. (8రాహుః) కుంభ ర॥ రా॥9-03. (1చంద్రః) మీన వసుః రా॥9-46. (12చంద్రః)

28. బుధ పంచమి పూర్వాభాద్ర అన్నప్రాశనాదులు కన్యా రాజః ఉ॥10-14. ఉత్తరాభాద్ర క్రయవిక్రయాదులు తులాశ్చ్యేరః ప॥1-05. (6చంద్రః,8రాహుః)

29. గురు షష్ఠి రేవతి క్రయవిక్రయాదులు తులా ర॥ ప॥1-01. (6చంద్రః,8రాహుః) సాధారణపనులు కుంభ మతాం॥ ర॥ రా॥8-56. మీన ర॥ రా॥9-39. (1చంద్రః) మేష ర॥ రా॥12-07. (8కేతుః)

30. శుక్ర సప్తమి అశ్విని సాధారణపనులు కుంభ ర॥ రా॥8-51. మీన మతాం॥ ర॥ రా॥9-34. మేష మతాం॥ ర॥ రా॥12-02. (1చంద్రః,8కేతుః)

ఆగస్ట్ 2. సోమ దశమి కృత్తిక (శనివేధ) సాధారణపనులు కుంభ వసుః రా॥8-40. మీన ర॥ రా॥9-23. రోహిణి (రాహుక్రాంతము) మేష వసుః రా॥11-51. (8కేతుః)

3. మంగళ దశమి రోహిణి (రాహుక్రాంతము) సాధరణపనులు కన్యా ర॥ ఉ॥9-51. ఏకాదశి రోహిణి (రాహుక్రాంతము) మీన ర॥ రా॥9-20.

4. బుధ ఏకాదశి మృగశిర క్రయవిక్రయాదులు తులా ర॥ ప॥12-38. (8చంద్ర9798ః,రాహుః) ద్వాదశి మృగశిర కుంభ ర॥ రా॥8-33. మీన మతాం॥ ర॥ రా॥9-16. మీన మతాం॥ ర॥ రా॥11-44.





## 5. శ్రావణ మాసము (9-08-2021 నుండి 7-09-2021 వరకు)

| | | | |
|---|---|---|---|
| | | రాహు | |
| గురు(వ) | శ్రావణ మాస ప్రారంభ గ్రహస్థితులు | | రవి చంద్ర |
| శని(వ) | | | కుజ బుధ శుక్ర |
| | కేతు | | |

11-08-2021 కన్యా శుక్ర
16-08-2021 సింహ రవి
26-08-2021 కన్యా బుధ
05-09-2021 తులా శుక్ర
06-09-2021 కన్యా కుజ

ఆగస్ట్ 9. సోమ శ్రావణ శుక్ల విదియ మఖ (శనివేధ) సాధారణపనులు మీన వసుః రా॥8-56. (6చంద్రః)

10. మంగళ విదియ మఖ (శనివేధ) సాధారణపనులు కన్యా ర॥ ఉ॥9-22. (12చంద్రః) పుబ్బ (కుజక్రాంతము) తులా ర॥ ప॥12-13, (8రాహుః)

11. బుధ తదియ పుబ్బ (కుజక్రాంతము) సాధారణపనులు కన్యాశ్చ్యేరః ఉ॥9-19. (12చంద్రః) చవితి ఉత్తర గృహప్రవేశాదులు మీన ర॥ రా॥8-48. (7చంద్రః) మీన ర॥ రా॥11-16. (6చంద్రః,8కేతుః) (చక్రశుద్దులు లేవు)

12. గురు పంచమి హస్త గృహప్రవేశాదులు మీన మతాం॥ ర॥ రా॥8-44. (7చంద్రః) మేష మతాం॥ ర॥ రా॥11-12. (6చంద్రః, 8కేతుః) (చక్రశుద్దులు లేవు)

13. శుక్ర పంచమి చిత్త అన్నప్రాశనాదులు కన్యా రాజః ఉ॥9-12. (1చంద్రః) క్రయవిక్రయాదులు తులా ర॥ ప॥12-03. (8కేతుః, 12చంద్రః) షష్ఠి చిత్త గృహప్రవేశాదులు మేష ర॥ రా॥11-09. (7చంద్రః,8కేతుః) (వృషభ చక్రశుద్ది లేదు)

14. శని షష్ఠి స్వాతి అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదీనాం కన్యా ర॥ ఉ॥9-08. సప్తమీ స్వాతి క్రయవిక్రయాదులు తులా ర॥ ఉ॥11-59. (1చంద్రః,8రాహుః) గృహప్రవేశాదులు మేష ర॥ రా॥11-05. (7చంద్రః,8కేతుః) (వివాహ,వృషభ చక్రశుద్దులు లేవు)

15. ఆది సప్తమి విశాఖ అన్నప్రాశనాదులు కన్యా ర॥ ఉ॥9-03.

16. సోమ నవమి అనురాధ (రవివేధ,కేతుక్రాంతము) అన్నప్రాశనాదులు తులా ర॥ ఉ॥11-50. (8రాహుః) సాధారణపనులు

మీన రాజః రా॥8-28.

17. మంగళ దశమీ జ్యేష్ఠ క్రయవిక్రయాదులు ధనుర్ మతాం॥ ర॥ ప॥3-53. (12చంద్రః) సాధారణపనులు మీన ర॥ రా॥8-24. మేష ర॥ రా॥10-52. (8చంద్రః,కేతుః)

18. బుధ ఏకాదశి మూల అన్నప్రాశన,వివాహ,గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు కన్యా మతాం॥ ర॥ ఉ॥8-51. క్రయవిక్రయాదులు ధనుర్ ర॥ ప॥3-49. (1చంద్రః) (వివాహ చక్రశుద్ధి లేదు)

19. గురు ద్వాదశి పూర్వాషాఢ అన్నప్రాశనాదులు కన్యా ర॥ ఉ॥8-48. తులా మతాం॥ ర॥ ఉ॥11-39. (8రాహుః) సాధారణపనులు మీన మతాం॥ ర॥ రా॥8-17.

20. శుక్ర త్రయోదశి ఉత్తరాషాఢ క్రయవిక్రయాదులు ధనుర్ మతాం॥ ర॥ ప॥3-41. వివాహ-గృహప్రవేశాదులు మీన ర॥ రా॥8-12. చతుర్దశి శ్రవణము (శనిక్రాంతము,రవివేధ) సాధారణ పనులు మేష ర॥ రా॥10-40. (8కేతుః) (వివాహ,వృషభ చక్రశుద్ధులు లేవు)

21. శని చతుర్దశి శ్రవణము (శనిక్రాంతము,రవివేధ) సాధారణపనులు కన్యా రాజః ఉ॥8-40. తులా ర॥ ఉ॥11-31. (8రాహుః) ధనుర్ ర॥ ప॥3-38.

22. ఆది పూర్ణిమ ధనిష్ఠ అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు కన్యా ర॥ ఉ॥8-36. (6చంద్రః) క్రయవిక్రయాదులు ధనుర్ ర॥ ప॥3-34. బ॥పాడ్యమి శతభిషము గృహప్రవేశాదులు మేష ర॥ రా॥10-33. (8కేతుః) (కలశ చక్రశుద్ధి లేదు)

23. సోమ బ॥పాడ్యమి శతభిషము అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశ వ్యాపారాదులు కన్యా మతాం॥ ర॥ ఉ॥8-31. (6చంద్రః) తులా ర॥ ఉ॥11-22. (8రాహుః) విదియ పూర్వాభాద్ర సాధారణపనులు మీన ర॥ రా॥8-00. (12చంద్రః) మేష ర॥ రా॥10-28. (8కేతుః) (కలశ చక్రశుద్ధి లేదు)

24. మంగళ విదియ పూర్వాభాద్ర క్రయవిక్రయాదులు ధనుర్ ర॥ ప॥3-25. తదియ ఉత్తరాభాద్ర సాధారణపనులు మీన మతాం॥ ర॥ రా॥7-56. (1చంద్రః) మేష మతాం॥ ర॥ రా॥10-24. (8కేతుః,12చంద్రః)







25. బుధ తదియ ఉత్తరాభాద్ర అన్నప్రాశన,గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు కన్యా ర॥ ఉ॥8-23. (7చంద్రః) తులా మతాం॥ ర॥ ఉ॥11-14. (6చంద్రః,8రాహుః) క్రయవిక్రయాదులు ధనుర్ శ్చ్రోరః ప॥3-21. చవితి రేవతి గృహప్రవేశాదులు మేష ర॥ రా॥10-20. (8కేతుః) (కలశ చక్రశుద్ధి లేదు)

26. గురు చవితి రేవతి అన్నప్రాశన,గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు కన్యా మతాం॥ ర॥ ఉ॥8-20. (7చంద్రః) పంచమి రేవతి సాధారణపనులు మీన మతాం॥ ర॥ రా॥7-49. (1చంద్రః) (కలశ చక్రశుద్ధి లేదు)

27. శుక్ర పంచమి అశ్విని (కుజవేధ) క్రయవిక్రయాదులు ధనుర్ ర॥ ప॥3-14. షష్ఠి అశ్విని (కుజవేధ) సాధారణపనులు మీన ర॥ రా॥7-45.

28. శని షష్ఠి భరణి (రవి-కేతువుల వేధ) సాధారణపనులు కన్యా ర॥ ఉ॥8-12. (8చంద్రః) తులా మతాం॥ ర॥ ఉ॥11-03. (7చంద్రః,8రాహుః) ధనుర్మాతాం॥ ర॥ ప॥3-10. మీన ర॥ రా॥7-41. సప్తమి భరణి (రవి-కేతువుల వేధ) మేష మతాం॥ ర॥ రా॥10-09. (1చంద్రః,8కేతుః)

29. ఆది సప్తమి కృత్తిక (శనివేధ) సాధారణపనులు కన్యా మతాం॥ ర॥ ఉ॥8-08. (8చంద్రః) తులా ర॥ ఉ॥10-59. (8చంద్రః, రాహుః)

30. సోమ అష్టమి రోహిణి (రాహుక్రాంతము) సాధారణపనులు తులా ర॥ ఉ॥10-56. (8చంద్రః,రాహుః) మీన వసుః రా॥7-34. మేషశ్చ్రోరః రా॥10-02. (8కేతుః)

31. మంగళ నవమి రోహిణి (రాహుక్రాంతము) సాధారణపనులు కన్యా మతాం॥ ర॥ ఉ॥8-00. నవమీ మృగశిర తులాశ్చ్రోరః ఉ॥10-51. (8చంద్రః,రాహుః) క్రయవిక్రయాదులు ధనుర్ వసుః ప॥2-58. (6చంద్రః) మేష ర॥ రా॥9-59. (8కేతుః)

సెప్టెంబర్ 1. బుధ దశమి మృగశిర అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశ వ్యాపారాదులు కన్యా ర॥ ఉ॥7-57. గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు తులా మతాం॥ ర॥ ఉ॥10-48. (8రాహుః) ఆరుద్ర సాధారణపనులు మీన ర॥ రా॥7-26. మేష ర॥ రా॥9-54. (8కేతుః)

2. గురు ఏకాదశి పునర్వసు వివాహ-గృహప్రవేశాదులు మీన వసుః రా॥7-21. గృహప్రవేశాదులు మేషశ్చ్రోరః రా॥9-49. (8కేతుః)

లగ్నము బలమైనపుడు చెడుతిథులు-వారములు ఏమీ చేజారవు!



## 6. భాద్రపద మాసము (8-09-2021 నుండి 6-10-2021 వరకు)

| | | | |
|---|---|---|---|
| | | రాహు | |
| గురు(వ) | భాద్రపద మాస ప్రారంభ గ్రహస్థితులు | | |
| శని(వ) | | | రవి |
| | కేతు | శుక్ర | చంద్ర కుజ బుధ |

**13-09-2021 మకర వక్రీ గురు**
**16-09-2021 కన్యా రవి**
**22-09-2021 తులా బుధ**
**23-09-2021 బుధ వక్రం మొదలు**
**01-10-2021 కన్యా వక్రీ బుధ**
**02-10-2021 వృశ్చిక శుక్ర**

సెప్టెంబర్ **8.** బుధ భాద్రపద శుక్ల విదియ ఉత్తర (కుజక్రాంతము) సాధారణ పనులు తులా ర॥ ఉ॥10-20. (12చంద్రః,8రాహుః) ధనుర్ ర॥ ప॥2-27.

9. గురు తదియ చిత్త సాధారణపనులు మేష ర॥ రా॥9-22. (6చంద్రః,8కేతుః)

10. శుక్ర చవితి చిత్త సాధారణపనులు తులా రాజః ఉ॥10-12. (1చంద్రః,8రాహుః) స్వాతి ధనుర్ ర॥ ప॥2-19. మేష వసుః రా॥9-18. (7చంద్రః,8కేతుః)

11. శని పంచమి స్వాతి సాధారణపనులు తులా ర॥ ఉ॥10-07. (1చంద్రః8రాహుః) షష్ఠి విశాఖ మేష ర॥ రా॥9-13. (7చంద్రః, 8కేతుః)

12. ఆది షష్ఠి అనురాధ (కేతుక్రాంతము) సాధారణపనులు తులా మతాం॥ ర॥ ఉ॥10-04. (8రాహుః) సప్తమి అనురాధ (కేతుక్రాంతము) మేష వసుః రా॥9-10. (8కేతుః)

13. సోమ సప్తమి జ్యేష్ఠ సాధారణపనులు తులా ర॥ ఉ॥9-59 (8రాహుః)

14. మంగళ నవమి మూల సాధారణపనులు ధను రాజః ప॥2-03. (1చంద్రః) మేష ర॥ రా॥9-02. (8కేతుః)

15. బుధ నవమి పూర్వాషాఢ సాధారణపనులు తులా రాజః ఉ॥9-51. (8రాహుః) దశమీ పూర్వాషాఢ ధనుర్ ర॥ ప॥1-58. (1చంద్రః) మేష వసుః రా॥8-57. (8కేతుః)

16. గురు ఏకాదశి ఉత్తరాషాఢ అన్నప్రాశనాదులు తులా వసుః ఉ॥9-48. (8రాహుః)

17. శుక్ర ద్వాదశి శ్రవణము (శనిక్రాంతము) సాధారణపనులు ధనుర్ రాజః ప॥1-51. మేష ర॥ రా॥8-50. (8కేతుః)

18. శని త్రయోదశి ధనిష్ఠ అన్నప్రాశనాదులు తులా ర॥ ఉ॥9-40. (8రాహుః) సాధారణపనులు ధనుర్ ర॥ ప॥1-47. శతభిషము



హస్తా నక్షత్రమునందు గృహ నిర్మాణము పరుల హస్తగతమగును.



సింహ తె॥5-12. (7చంద్రః)

19. ఆది చతుర్దశి శతభిషము సాధారణపనులు ధనుర్ ర॥ ప॥1-43. మేష మతాం॥ ర॥ రా॥8-42. (8కేతుః) పూర్వాభాద్ర సింహ ర॥ తె॥5-08. (7చంద్రః)

20. సోమ పూర్ణిమ పూర్వాభాద్ర సాధారణపనులు తులా మతాం॥ ర॥ ఉ॥9-32. (8రాహుః) సాధారణపనులు ధనుర్మతాం॥ ర॥ ప॥1-39. మేష ర॥ రా॥8-38. (8కేతుః)

21. మంగళ బ॥పాడ్యమి ఉత్తరాభాద్ర సాధారణపనులు ధనుర్ ర॥ ప॥1-34. ఉత్తరాభాద్ర (కుజవేధ) మేష మతాం॥ ర॥ రా॥8-33. (8కేతుః,12చంద్రః) సింహ తె॥4-59. (8చంద్రః)

22. ఆది విదియ రేవతి (రవివేధ) సాధారణపనులు ధనుర్ ర॥ ప॥1-31. మేష రాజః రా॥8-30. (8కేతుః,12చంద్రః) సింహ తె॥4-56. (8చంద్రః)

23. గురు తదియ అశ్విని అన్నప్రాశనాదులు తులా ర॥ ఉ॥9-20. (7చంద్రః,8రాహుః) ధనుర్ ర॥ ప॥1-29.

24. శుక్ర చవితి భరణి (కేతువేధ) సాధారణపనులు ధనుర్ ర॥ ప॥1-23. సింహ తె॥4-48.

25. శని పంచమి కృత్తిక (శనివేధ) సాధారణపనులు ధనుర్ చోరః ప॥1-19. మేష ర॥ రా॥8-18. (8కేతుః) సింహ తె॥4-44.

26. ఆది షష్ఠి రోహిణి (రాహుక్రాంతము) సాధారణపనులు మేష ర॥ రా॥8-15. (8కేతుః) సింహ తె॥4-41.

27. సోమ షష్ఠి రోహిణి (రాహుక్రాంతము) సాధారణపనులు ధనుర్ ర॥ ప॥1-11. (6చంద్రః) సప్తమి మృగశిర మేష మతాం॥ ర॥ రా॥8-10. (8కేతుః)

28. మంగళ సప్తమి మృగశిర సాధారణపనులు ధనుర్శ్చోరః ప॥1-07. అష్టమీ మృగశిర మేష వసుః రా॥8-06. (8కేతుః) ఆరుద్ర సింహ తె॥4-32.

29. బుధ అష్టమి ఆరుద్ర సాధారణపనులు తులా ర॥ ఉ॥8-56. (8రాహుః) సాధారణపనులు ధనుర్ ర॥ ప॥1-03. నవమీ పునర్వసు సింహ తె॥4-28.

30. గురు నవమి పునర్వసు సాధారణపనులు మేష రాజః రా॥7-57. (8కేతుః)

అక్టోబర్ 1. శుక్ర దశమి పుష్యమి సాధారణపనులు మేష ర॥ రా॥7-54. (8కేతుః) ఏకాదశి ఆశ్లేష (కేతువేధ) సింహ తె॥4-20. (12చంద్రః)

2. శని ఏకాదశి ఆశ్లేష (కేతువేధ) సాధారణపనులు తులా ర॥ ఉ॥8-44. (8రాహుః) ధనుర్ ర॥ ప॥12-51. (8చంద్రః) ద్వాదశి మఖ (శనివేధ) సింహ తె॥4-16. (1చంద్రః)

స్వాతి-శతభిషా నక్షత్రములు గృహనిర్మాణమునకు సామాన్య ఫలములే ఇచ్చును.



## 7. ఆశ్వయుజ మాసము (7-10-2021 నుండి 4-11-2021 వరకు)

| | | | |
|---|---|---|---|
| | | రాహు | |
| | ఆశ్వయుజమాస ప్రారంభ గ్రహస్థితులు | | |
| గురు(వ) శని(వ) | | | |
| | కేతు శుక్ర | | రవి,చంద్ర బుధ(వ) కుజ |

**11-10-2021 శని వక్రం ఆఖరు**
**17-10-2021 తులా రవి**
**18-10-2021 బుధ వక్రం ఆఖరు**
**18-10-2021 గురు వక్రం ఆఖరు**
**21-10-2021 తులా కుజ**
**30-10-2021 ధనుసు శుక్ర**
**02-11-2021 తులా బుధ**

అక్టోబర్7.గురు ఆశ్వయుజ శుక్ల విదియ చిత్త గృహప్రవేశాదులు మేష రాజః రా॥7-30. (7చంద్రః,8కేతుః) స్వాతి వివాహ-గృహారంభ ప్రవేశాదులు సింహ ర॥ రా॥3-56. (చక్రశుద్ధులు లేవు)

8. శుక్ర తదియ విశాఖ (రాహువేధ) సాధారణపనులు సింహ రా॥3-52.

9. శని చవితి విశాఖ (రాహువేధ) సాధారణపనులు తులా ర॥ ఉ॥8-16. (1చంద్రః,8రాహుః) ధనుర్ ర॥ ప॥12-23. అనురాధ (కేతుక్రాంతము) వివాహ-గృహారంభ-ప్రవేశాదులు సింహ చోరః రా॥3-48. (వృషభ,కలశ చక్రశుద్ధులు లేవు)

10. ఆది పంచమి అనురాధ (కేతుక్రాంతము) అన్నప్రాశనాదులు తులా ర॥ ఉ॥8-12. (8రాహుః) సాధారణపనులు ధనుర్ ర॥ ప॥12-19. జ్యేష్ఠ మేష ర॥ రా॥7-18. (8చంద్రః) షష్ఠి జ్యేష్ఠ సింహ ర॥ రా॥3-44.

11. సోమ షష్ఠి జ్యేష్ఠ సాధారణపనులు తులా మతాం॥ ర॥ ఉ॥ 8-09. (8రాహుః) సప్తమి మూల గృహారంభ-ప్రవేశాదులు సింహ రా॥3-41. (వృషభ చక్రశుద్ధి లేదు)

12. మంగళ సప్తమి మూల సాధారణపనులు తులా ర॥ ఉ॥8-05. (8రాహుః) పూర్వాషాఢ ధనుర్ ర॥ ప॥12-12. (1చంద్రః) మేష రాజః రా॥7-11. అష్టమీ పూర్వాషాఢ సింహ ర॥ రా॥3-37.

13. బుధ అష్టమి పూర్వాషాఢ సాధారణపనులు తులా ర॥ ఉ॥ 8-01. (8రాహుః) నవమీ ఉత్తరాషాఢ వివాహ-గృహారంభ-ప్రవేశాదులు సింహ ర॥ రా॥3-33. (6చంద్రః) (వివాహ చక్ర శుద్ధి లేదు)

14. గురు నవమి ఉత్తరాషాఢ అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశ-



ముహూర్తం బలంగా ఉన్ననూ జాతకము సహకరించాలి.



వ్యాపారాదులు తులా చోరః ఉ॥7-56. (8రాహుః) శ్రవణము (శనిక్రాంతము-రాహువేధ) సాధారణపనులు ధనుర్ ర॥ ప॥12-03. దశమి శ్రవణము (శనిక్రాంతము,రాహువేధ) సింహ రా॥3-28. (6చంద్రః)

15. శుక్ర దశమి శ్రవణము (శనిక్రాంతము,రాహువేధ) సాధారణ పనులు తులా ర॥ ఉ॥7-52, (8రాహుః) ధనిష్ఠ అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥11-59. ఏకాదశి ధనిష్ఠ గృహప్రవేశాదులు మేష ర॥ రా॥6-58. (8కేతుః) గృహారంభ-ప్రవేశాదులు సింహ ర॥ రా॥3-24. (7చంద్రః)

16. శని ఏకాదశి ధనిష్ఠ అన్నప్రాశన,గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు తులా ర॥ ఉ॥7-49. (8రాహుః) శతభిషము ధనుర్ చోరః ఉ॥11-56. ద్వాదశి శతభిషము గృహప్రవేశాదులు మేష మతాం॥ ర॥ రా॥6-55. (8కేతుః) గృహారంభ-ప్రవేశాదులు సింహ ర॥ రా॥3-21. (7చంద్రః) (శతభిషమునకు వృషభ చక్రశుద్ధి లేదు)

17. ఆది త్రయోదశి పూర్వాభాద్ర (రవివేధ,కుజవేధ) సాధారణ పనులు సింహ రా॥3-18. (7చంద్రః)

18. సోమ త్రయోదశి ఉత్తరాభాద్ర అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥11-48. చతుర్దశి ఉత్తరాభాద్ర సాధారణపనులు సింహ రా॥3-13. (8చంద్రః) (వృషభ చక్ర శుద్ధి లేదు)

19. మంగళ చతుర్దశి ఉత్తరాభాద్ర సాధారణపనులు ధనుర్ ర॥ ఉ॥11-44. పూర్ణిమ రేవతి సింహ ర॥ రా॥3-09. (8చంద్రః)

20. బుధ బ॥పాడ్యమి అశ్విని వివాహ-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు సింహ రా॥3-05.

21. గురు బ॥పాడ్యమి అశ్విని అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥11-37. విదియ భరణి (కేతువేధ) సాధారణపనులు సింహ ర॥ రా॥3-02. (కలశ చక్రశుద్ధి లేదు)

22. శుక్ర విదియ భరణి (కేతువేధ) సాధారణపనులు కుంభ ర॥ ప॥3-20. తదియ కృత్తిక (శనివేధ) సింహ మతాం॥ ర॥ రా॥2-57. కన్యా ర॥ రా॥4-34.

23. శని తదియ కృత్తిక సాధారణపనులు ధనుర్ రాజః ఉ॥11-28.

(6చంద్రః) కుంభశ్చోరః ప॥3-16. చవితి రోహిణి వివాహ-గృహారంభ-ప్రవేశాదులు కన్యా ర॥ తె॥4-30. (వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)

24. ఆది చవితి రోహిణి అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥11-24. (6చంద్రః) మృగశిర వివాహ-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు సింహ చోరః రా॥2-49. కన్యా ర॥ తె॥4-26. (వివాహ,కలశచక్రశుద్ధులు లేవు)

25. సోమ పంచమి మృగశిర అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥11-20. (6చంద్రః) గృహారంభ-ప్రవేశాదులు సింహ మతాం॥ ర॥ రా॥2-45. కన్యా ర॥ తె॥4-22. (కలశ చక్రశుద్ధి లేదు)

26. మంగళ షష్ఠి ఆరుద్ర సాధారణపనులు ధనుర్మృతాం॥ ర॥ ఉ॥11-26. (7చంద్రః) సింహ రా॥2-41. కన్యా తె॥4-18.

27. బుధ సప్తమి పునర్వసు అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥11-12. (7చంద్రః) వివాహ-గృహప్రవేశాదులు సింహ ర॥ రా॥2-37. వివాహ-గృహారంభ-ప్రవేశాదులు కన్యా మతాం॥ ర॥ తె॥4-14. (వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)

28. గురు అష్టమి పుష్యమి వివాహ-గృహప్రవేశాదులు సింహ మతాం॥ ర॥ రా॥2-34. (12చంద్రః) వివాహ-గృహారంభ- ప్రవేశాదులు కన్యా ర॥ తె॥4-11. (వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)

29. శుక్ర అష్టమి పుష్యమి సాధారణపనులు ధనుర్మృతాం॥ ర॥ ఉ॥11-04. (8చంద్రః) నవమీ ఆశ్లేష (కేతువేధ) సాధారణ పనులు కుంభ వసుః ప॥2-52. (6చంద్రః) కన్యా ర॥ తె॥4-06.

30. శని నవమి ఆశ్లేష (కేతువేధ) సాధారణపనులు ధనుర్ ర॥ ఉ॥11-00. (8చంద్రః) దశమీ మఖ (శనివేధ) సింహ ర॥ రా॥2-25. (1చంద్రః) కన్యా తె॥4-02.

31. ఆది దశమి మఖ (శనివేధ) అన్నప్రాశనాదులు ధనుర్ ర॥ ఉ॥10-57. ఏకాదశి పూర్వఫల్గుణి సాధారణపనులు కన్యా తె॥3-59. (12చంద్రః)

నవంబర్ 1. సోమ ఏకాదశి పూర్వఫల్గుణి సాధారణపనులు ధనుశ్చోరః ఉ॥10-52. ద్వాదశి ఉత్తర గృహప్రవేశాదులు సింహ మతాం॥ ర॥ రా॥2-17. సాధారణపనులు కన్యా ర॥ తె॥3-54. (1చంద్రః)





## 8. కార్తీక మాసము (5-11-2021 నుండి 4-12-2021 వరకు)

| | | | |
|---|---|---|---|
| | | రాహు | |
| | కార్తీక మాస ప్రారంభ గ్రహస్థితులు | | |
| గురు శని | | | |
| శుక్ర | కేతు | రవి,చంద్ర బుధ కుజ | |

16-11-2021 వృశ్చిక రవి
21-11-2021 వృశ్చిక బుధ
21-11-2021 కుంభ గురు

నవంబర్ 5. శుక్ర కార్తీక శుక్ల విదియ అనురాధ (కేతుక్రాంతము) సాధారణ పనులు కన్యా మతాం॥ ర॥ రా॥3-39.

6. శని విదియ అనురాధ (కేతుక్రాంతము) అన్నప్రాశనాదులు ధనుర్ ర॥ ఉ॥10-33. (12చంద్రః) తదియ జ్యేష్ఠ సాధారణ పనులు సింహ మతాం॥ ర॥ రా॥1-58. కన్యా ర॥ రా॥3-35.

7. ఆది తదియ జ్యేష్ఠ సాధారణపనులు ధనుర్ రాజః ఉ॥10-28. (12చంద్రః) కుంభశ్చోరః ప॥2-16. చవితి మూల వివాహ-గృహారంభ-ప్రవేశాదులు కన్యా ర॥ రా॥3-30. (వృషభ,కలశ చక్ర శుద్ధులు లేదు)

8. సోమ చవితి మూల సాధారణపనులు ధనుర్ ర॥ ఉ॥10-25. (1చంద్రః) పంచమి పూర్వాషాఢ సాధారణపనులు సింహ ర॥ రా॥1-50. కన్యా తె॥3-29.

9. మంగళ షష్ఠి పూర్వాషాఢ క్రయవిక్రయాదులు కుంభ మతాం॥ ర॥ ప॥2-09. ఉత్తరాషాఢ గృహారంభ-ప్రవేశాదులు కన్యా ర॥ రా॥3-23.

10. బుధ సప్తమి ఉత్తరాషాఢ అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥10-17. క్రయవిక్రయాదులు కుంభ ర॥ ప॥2-05. (12చంద్రః) శ్రవణము (శని క్రాంతము,రాహువేధ) సాధారణపనులు కన్యా ర॥ రా॥3-19. (వృషభ చక్రశుద్ధి లేదు)

11. గురు అష్టమి ధనిష్ఠ (రవివేధ) వివాహ,గృహప్రవేశదులు సింహ ర॥ రా॥1-38. (6చంద్రః) గృహారంభ-ప్రవేశాదులు కన్యా

తె॥3-15. (వివాహ చక్రశుద్ధి లేదు)

12. శుక్ర నవమి ధనిష్ఠ (రవివేధ) క్రయవిక్రయాదులు కుంభ రాజః ప॥1-56. (1చంద్రః) శతభిషము (కుజవేధ) సాధారణ పనులు సింహ వసుః రా॥1-33. (7చంద్రః) కన్యా ర॥ రా॥3-10. (6చంద్రః)

13. శని దశమి శతభిషము (కుజవేధ) సాధారణపనులు ధనుర్ ర॥ ఉ॥10-05. కుంభ ర॥ ప॥1-53. (1చంద్రః) పూర్వాభాద్ర కన్యా ర॥ రా॥3-07. (6చంద్రః)

14. ఆది ఏకాదశి పూర్వాభాద్ర క్రయవిక్రయాదులు కుంభ ర॥ ప॥1-49. ఉత్తరాభాద్ర గృహారంభ-ప్రవేశాదులు కన్యా రా॥3-03. (7చంద్రః) (వృషభ చక్రశుద్ధి లేదు)

15. సోమ ద్వాదశి ఉత్తరాభాద్ర అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశాదులు ధనుర్ రాజః ఉ॥9-58. (4చంద్రః) క్రయవిక్రయాదులు కుంభ చోరః ప॥1-46. రేవతి గృహారంభ-ప్రవేశాదులు కన్యా రా॥3-00. (7చంద్రః) (వృషభ చక్రశుద్ధి లేదు)

16. మంగళ త్రయోదశి రేవతి సాధారణపనులు ధనుర్ ర॥ ఉ॥9-54. కుంభ ర॥ ప॥1-42. అశ్విని గృహప్రవేశాదులు సింహ రాజః రా॥1-19. (వృషభ చక్రశుద్ధి లేదు)

17. బుధ త్రయోదశి అశ్విని అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥9-49. చతుర్దశి అశ్విని క్రయవిక్రయాదులు కుంభ ర॥ ప॥1-37. భరణి (కేతువేధ) సాధారణపనులు సింహ ర॥ రా॥1-14. (వృషభ చక్రశుద్ధి లేదు)

18. గురు పూర్ణిమ భరణి (కేతువేధ) సాధారణపనులు కుంభ మతాం॥ ర॥ ప॥1-33. సింహ ర॥ రా॥1-10.

19. శుక్ర పూర్ణిమ కృత్తిక (రాహుక్రాంతము,రవి-శనుల వేధ) సాధారణపనులు ధనుర్ మతాం॥ ర॥ ఉ॥9-42. (6చంద్రః)

20. శని బ॥పాడ్యమి రోహిణి అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥9-38. (6చంద్రః) క్రయవిక్రయాదులు కుంభ ర॥ ప॥1-26. విదియ రోహిణి వివాహ-గృహప్రవేశాదులు సింహ ర॥ రా॥1-03. (కలశ చక్రశుద్ధి లేదు)

21. ఆది విదియ మృగశిర అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశ-





వ్యాపారాదులు ధనుర్ వసుః ఉ॥9-34. (6చంద్రః) తదియ మృగశిర వివాహ,గృహప్రవేశాదులు సింహ ర॥ రా॥12-59. (6గురుః) కన్యా చోరః రా॥2-36. (వివాహ,కలశ చక్రశుద్ధులు లేవు)

22. సోమ తదియ ఆరుద్ర క్రయవిక్రయాదులు కుంభ రాజః ప॥1-18. చవితి ఆరుద్ర సాధారణపనులు సింహ వసుః రా॥12-55. కన్యా ర॥ రా॥2-32.

23. మంగళ చవితి ఆరుద్ర సాధారణపనులు ధనుర్మతాం॥ ర॥ ఉ॥9-27. కుంభ మతాం॥ ర॥ ప॥1-15. పంచమీ పునర్వసు గృహప్రవేశాదులు కన్యా ర॥ రా॥2-29. (కలశ చక్రశుద్ధి లేదు)

24. బుధ పంచమి పునర్వసు అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥9-23. (7చంద్రః) క్రయవిక్రయాదులు కుంభ ర॥ ప॥1-11. (6చంద్రః) పుష్యమి గృహప్రవేశాదులు సింహ ర॥ రా॥12-48. (7గురుః,12చంద్రః) (కలశ చక్రశుద్ధి లేదు)

25. గురు షష్ఠి పుష్యమి క్రయవిక్రయాదులు కుంభ ర॥ ప॥1-07. (6చంద్రః) ఆశ్లేష (రవి-కేతువుల వేధ) సాధారణపనులు సింహ ర॥ రా॥12-44. (12చంద్రః) కన్యా వసుః రా॥2-21.

26. శుక్ర సప్తమి ఆశ్లేష (రవి-కేతువుల వేధ) సాధారణపనులు కుంభ చోరః ప॥1-02. (6చంద్రః)

27. శని అష్టమి మఖ (శనివేధ) సాధారణపనులు ధనుర్ ర॥ ఉ॥9-10. కుంభ ర॥ ప॥12-58. (7చంద్రః) పూర్వఫల్గుణి సింహ మతాం॥ ర॥ రా॥12-35. (1చంద్రః) కన్యా ర॥ రా॥2-12. (12చంద్రః)

28. ఆది నవమి పుబ్బ అన్నప్రాశనాదులు ధనుర్ ర॥ ఉ॥9-06. క్రయవిక్రయాదులు కుంభ ర॥ ప॥12-54. (7చంద్రః) ఉత్తర సాధారణపనులు సింహ ర॥ రా॥12-31. (1చంద్రః)

29. సోమ దశమి ఉత్తర అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ మతాం॥ ర॥ ఉ॥9-03. హస్త గృహప్రవేశాదులు సింహ ర॥ రా॥12-28. సాధారణపనులు కన్యా రా॥2-05. (1చంద్రః) (కలశ చక్రశుద్ధి లేదు)

## 9. మార్గశిర మాసము (5-12-2021 నుండి 2-01-2022 వరకు)

| | | | |
|---|---|---|---|
| | | రాహు | |
| గురు | మార్గశిర మాస ప్రారంభ గ్రహస్థితులు | | |
| శని | | | |
| శుక్ర | రవి,చంద్ర బుధ కేతు | కుజ | |

05-12-2021 వృశ్చిక కుజ
08-12-2021 మకర శుక్ర
10-12-2021 ధనుసు బుధ
15-12-2021 ధనుసు రవి
19-12-2021 శుక్ర వక్రం మొదలు
29-12-2021 మకర బుధ
29-12-2021 ధనుసు వక్రీ శుక్ర

డిసెంబర్ **5.** ఆది మార్గశిర శుక్ల విదియ మూల క్రయవిక్రయాదులు కుంభ మతాం॥ ర॥ ప॥12-27. మీన ర॥ ప॥1-10. గృహప్రవేశాదులు సింహ ర॥ రా॥12-04. (7గురుః) (చక్రశుద్ధులు లేవు)

6. సోమ తదియ పూర్వాషాఢ సాధారణపనులు ధనుర్ ర॥ ఉ॥ 8-34. (1చంద్రః) సింహ ర॥ రా॥11-59. కన్యా రాజః రా॥1-36. చవితి ఉత్తరాషాఢ గృహప్రవేశాదులు తులా ర॥ తె॥4-27. (8రాహుః) (చక్రశుద్ధులు లేవు)

7. మంగళ చవితి ఉత్తరాషాఢ క్రయవిక్రయాదులు కుంభ ర॥ ప॥12-19. (12చంద్రః) మీన రాజః ప॥1-02. పంచమి ఉత్తరాషాఢ సాధారణపనులు సింహ ర॥ రా॥11-56. (6చంద్రః) శ్రవణము (శనిక్రాంతము,రాహువేధ) కన్యా ర॥ రా॥1-33.

8. బుధ పంచమి శ్రవణము (శనిక్రాంతము-రాహువేధ) సాధారణపనులు మీన ర॥ ప॥12-57. షష్ఠి ధనిష్ఠ (కుజవేధ) కన్యా ర॥ రా॥1-28. తులా తె॥4-19. (8రాహుః)

9. గురు షష్ఠి ధనిష్ఠ (కుజవేధ) సాధారణపనులు ధనుర్ ర॥ ఉ॥8-23. కుంభ ర॥ ప॥12-11. (1చంద్రః) సప్తమీ శతభిషము గృహప్రవేశాదులు సింహ ర॥ రా॥11-48. (7చంద్రః) వివాహ-గృహప్రవేశాదులు కన్యా మతాం॥ ర॥ రా॥1-25. (6చంద్రః) గృహారంభ-ప్రవేశాదులు తులా తె॥4-16. (8రాహుః) (వివాహ చక్రశుద్ధి లేదు)

10. శుక్ర సప్తమి శతభిషము క్రయవిక్రయాదులు కుంభ ర॥





ప॥12-07. (1చంద్రః) అష్టమి పూర్వాభాద్ర సాధారణపనులు సింహ మతాం॥ ర॥ రా॥11-44. (7చంద్రః) కన్యా ర॥ రా॥1-21. (6చంద్రః)

11. శని అష్టమి పూర్వాభాద్ర సాధారణపనులు ధనుర్ రాజః ఉ॥ 8-16. కుంభ చోరః ప॥12-04. (1చంద్రః) మీన ర॥ ప॥12-47. నవమీ ఉత్తరాభాద్ర గృహప్రవేశాదులు కన్యా ర॥ రా॥1-18. (7చంద్రః) గృహారంభ-ప్రవేశాదులు తులా తె॥4-09. (6చంద్రః,8రాహుః)

12. ఆది నవమి ఉత్తరాభాద్ర అన్నప్రాశన-వివాహ-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥8-11. (4చంద్రః) క్రయవిక్రయాదులు మీన ర॥ ప॥12-42. (1చంద్రః) దశమీ రేవతి గృహప్రవేశాదులు కన్యా వసుః రా॥1-13. (7చంద్రః) గృహారంభ-ప్రవేశాదులు తులా తె॥4-04. (6చంద్రః,8రాహుః) (వివాహ చక్రశుద్ధి లేదు)

13. సోమ దశమీ రేవతి అన్నప్రాశన-గృహారంభ-ప్రవేశ-వ్యాపారాదులు ధనుర్ ర॥ ఉ॥8-07. (4చంద్రః) కుంభ ర॥ ఉ॥11-55. ఏకాదశి రేవతి సాధారణపనులు సింహ ర॥ రా॥11-32. (8చంద్రః) అశ్విని గృహారంభ-ప్రవేశాదులు తులా తె॥4-00. (7చంద్రః,8రాహుః) (అశ్వినికి వృషభ చక్రశుద్ధి లేదు)

14. మంగళ ఏకాదశి అశ్విని సాధారణపనులు ధనురశ్చోరః ఉ॥ 8-04. కుంభ మతాం॥ ర॥ ఉ॥11-52. మీన ర॥ ప॥12-35. ద్వాదశి అశ్విని గృహారంభ-ప్రవేశాదులు తులా తె॥3-57. (7చంద్రః,8రాహుః) (వృషభ చక్రశుద్ధి లేదు)

15. బుధ ద్వాదశి భరణి (కుజ-కేతువేధ) సాధారణపనులు మీన ర॥ ప॥12-31. సింహ ర॥ రా॥11-25. త్రయోదశి భరణి తులా తె॥3-53. (7చంద్రః,8రాహుః)

16. గురు త్రయోదశి కృత్తిక (రాహుక్రాంతము-శనివేధ) సాధారణపనులు కుంభ ర॥ ఉ॥11-44. మీనశ్చోరః ప॥12-27. సింహ వసుః రా॥11-21. కన్యా ర॥ రా॥12-58.

